Regd No. M.1118.

12 పేజీలు-2 అణాలు



# ఆంధ్రపత్రిక

Founder: K. NAGESWARA ROW. — SUNDAY EDITION.

317600

Vol. 36. ANDHRA PATRIKA, MADRAS. 4th DECEMBER 1949 No. 241



# "ఆంధ్రరాష్ట్రం ఏర్పడి సవ్యమైన పరిపాలన సాగేవరకూ ఏ ఇతర భాషా రాష్ట్రాన్నీ నిర్మించేది లేదు"



## పరిస్థితులు అనుకూలించేవరకూ వేచి వుండాలని కేరళులకు పటేల్ సలహా

### రాజప్రముఖుని ఉనికి ఐక్య కేరళ నిర్మాణానికి అడ్డుపడదని స్పష్టీకరణ

### 'తిరువాన్కూర్-కొచిన్ సమాఖ్య మద్రాస్‌లో చేరదు'

న్యూఢిల్లీ, డిసెంబరు 2: "ఆంధ్రరాష్ట్రం యేర్పడి సవ్యంగా పరిపాలనా వ్యవహారాలు సాగేటంతవరకూ, మరి యే భాషారాష్ట్రాన్నైనా నిర్మించాలనే ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదు. జె. వి. పి. నివేదికలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికే ముందుగా పూనుకోవాలని సూచింపబడింది. కనుక దేశమంతటా పరిస్థితులు సానుకూలపడే వరకూ, కేరళులు వేచి ఉండాలి. పరిస్థితులు సానుకూలపడగానే ప్రభుత్వమే కేరళ రాష్ట్ర నిర్మాణానికి పూనుకొంటుంది." అని సర్దార్ వల్లభాయ్ పటేల్, కే. పి. కేశవమీనన్ నాయకత్వాన కేరళ రాయబారసంఘం తనకు సమర్పించిన విజ్ఞాపన పత్రమునకు సమాధానమిస్తూ ప్రకటించారు.

ఐక్యకేరళ నిర్మాణానికి కొచ్చిన్ తిరువాన్కూర్లు మద్రాసు రాష్ట్రంలో లీనం చేయడం అవసరం లేదని. కొచ్చిన్ తిరువాన్కూర్ రాజప్రముఖుడు ఉండడం కేరళ రాష్ట్ర నిర్మాణానికి అభ్యంతరం కాబోవనికూడా సర్దార్ పటేల్ స్పష్టంచేశారు.

నూతనరాజ్యాంగ చట్టం అమలులోకి వచ్చే యీలోగానే కేరళ రాష్ట్రాన్ని నిర్మించాలని నూతనరాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాతనైతే 3 వ సెక్షన్ ప్రకారం యే క్రొత్తరాష్ట్రాన్నైనా నిర్మించాలంటే అతిక్లిష్టమైన విధానాన్ని అవలంబించవలసి వచ్చునని అందువల్ల చాలాకాలం పట్టవచ్చునని, కేరళ రాయబార సంఘం వారు తమ విజ్ఞాపనలో సర్దార్ వల్లభాయ్ పటేల్‌ను కోరారు. ఈ విజ్ఞాపనను కేరళ రాయబార సంఘం వారు నిన్న సర్దార్ పటేల్‌కు సమర్పించారు.

జె.వి.పి. నివేదికలో కేరళరాష్ట్రనిర్మాణానికి విధింపబడిన షరతులన్నీ నెరవేర్చబడునని అందుచేత కేరళరాష్ట్రనిర్మాణం ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికన్నా సులువని వీరు సర్దార్‌కు తెలియజేశారు.

నూతనరాజ్యాంగచట్టం అమలులోకి వచ్చే జనవరి 26 వ తేదీలోగా క్రొత్త రాష్ట్రాన్ని యేర్పాటుచేయడానికి ఆచరణరీత్యా కొన్ని యిబ్బందులున్నవని అందుచేత, దేశమంతటా పరిస్థితులుసానుకూలపడేవరకూ కేరళులు వేచిఉండాలని సర్దార్‌పటేల్ సలహాయిచ్చినట్లు, ఐక్యకేరళ సంఘ కార్యదర్శి, రాయబార సంఘ సభ్యులలో ఒకరు, దామోదర మీనన్ చెప్పారు. రాయబారసంఘం జె. వి. పి నివేదికను ప్రస్తావించగా, జె. వి. పి. నివేదికలో ముందుగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికే పూనుకోవాలని సూచింపబడిందని, అందువల్ల ఆంధ్రరాష్ట్రం యేర్పడి పరిపాలనా వ్యవహారాలు సక్రమంగా సాగించగలిగేవరకూ యే భాషా రాష్ట్రాన్నైనా నిర్మించాలనే ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదు అని సర్దార్ పటేల్ చెప్పారట.

కేరళ రాష్ట్ర నిర్మాణానికి తొలిచర్యగా కొచ్చిన్ తిరువాన్కూర్‌లను మద్రాసు రాష్ట్రంలో కలపడం అవసరమా అని రాయబార సంఘం చేసిన ప్రశ్నకు సమా

5-వ పేజీ చూడుడు

# ఆగ్నేయాసియా రక్షణ సమస్య

## భారతదేశ నాయకత్వాన ఫిబ్రవరిలో ఏడు రాజ్యాల సమావేశం

### బర్మా విదేశాంగమంత్రి ప్రకటన

లండన్, డిసెంబరు 2: ఆగ్నేయ ఆసియా రక్షణ సమస్యల గూర్చి చర్చించడానికి ఫిబ్రవరిలో ఇండియా, పాకిస్తాన్, బర్మా, సయామ్, ఆస్ట్రేలియా, ఇండొనేషియా, ఫిలిప్పీన్స్ దేశాల ప్రతినిధులు సమావేశం జరుపుతారని బర్మా విదేశాంగ మంత్రి యు ఇ. మాంగ్ నేటి రాత్రి లండన్‌లో వెల్లడించెను.

ఈ సమావేశం భారత దేశం నాయకత్వం కింద జరగాలని ఆగ్నేయ ఆసియా రాజ్యాలు సర్వసామాన్యంగా అభిప్రాయపడుతున్నవని, ఆయన చెప్పెను. సమావేశం ఫిలిప్పీన్స్‌లో జరగాలని ఫిలిప్పీన్స్ ప్రభుత్వమూ, న్యూఢిల్లీలో జరగాలని భారత ప్రభుత్వమూ కోరుతున్నవి.

సమావేశాధ్యక్షత ఎలాగూ ఇండియాకు లభిస్తోంది. కాబట్టి సమావేశాన్ని, రాజీమార్గంగా ఫిలిప్పీన్స్‌లోనే జరపడం ఉచితంగా ఉంటుందని తనకు తోస్తున్నదని బర్మా విదేశాంగమంత్రి యు. ఇ. మాంగ్ అనెను. సమావేశం సమితి ప్రణాళికలో చెప్పిన పద్ధతిగా ప్రజాస్వామ్య మాత్రబద్ధంగా జరుగుతుందని ఆయన చెప్పెను.

చైనాలో ఏర్పడిన కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని బర్మా త్వరలో గుర్తిస్తుందా అన్న ప్రశ్నకు యు. ఇ. మాంగ్ ఇట్లు సమాధానమిచ్చెను. "కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని త్వరలో గుర్తించక తప్పదు. అయితే వారిని స్నేహితుల్ని కావలించుకున్నట్లు కావలించుకో బోతున్నామని కాదు. వాస్తవిక పరిస్థితులను గుర్తించడం అగత్యం."

బర్మాలో కమ్యూనిస్టు ముప్పునుగురించి ప్రస్తావిస్తూ, ఆయన ఇట్లు చెప్పెను:— "బర్మాలో కమ్యూనిజం వెనక బట్టింది.

కొంతకాలంకిందట ప్రతివారికీ కమ్యూనిస్టులమని చెప్పుకోవడం ఒక ఫాషన్‌గా ఉండేది. కాని ఇప్పుడు కమ్యూనిజం బండారం బైటపడ్డతర్వాత ప్రజలకు అది అంటే ఏవగింపు కలిగింది. చైనాలో కమ్యూనిస్టులు విజయంసాధించడం సరిహద్దున ఉన్న మాకు కొంత ఆందోళన కలిగించకపోలేదు. సరిహద్దుదాడులు ఇకమీద తీవ్రతరం కాగలవు. అంతేగాక వాతావరణం కమ్యూనిస్టుల రాజకీయ సిద్ధాంతాలతో విషపూరితం అయే అవకాశంకూడా ఉన్నది. బర్మాలో కమ్యూనిజమ్‌ను ప్రతిఘటించడంలో పాశ్చాత్య రాజ్యాలు తోడ్పడతవా అన్న ప్రశ్నకు తమకు ఈ విషయమై ఒడంబడిక ఏదీ జరగలేదనీ, బర్మా అమెరికాను ఆయుధాలు అడగలేదని ఆయన చెప్పెను.

## చైనా-వియత్నాం సరిహద్దు పరిస్థితి

### ఫ్రెంచి వైఖరి

పారిస్, డిసెంబర్ 2: కొమింటాంగ్ సేనలు చైనా సరిహద్దులను దాటి వియత్నాంలోకి ప్రవేశిస్తే అంతర్జాతీయ నియమాలను బట్టి నిరాయుధులను చేసి నిర్బంధిస్తామనీ, అనంతరం వీలయినప్పుడు వారిదేశానికి పంపుతామనీ ఫ్రెంచి విదేశాంగ కార్యాలయానికి చెందిన ఒక ఉద్యోగి నేడు వెల్లడించాడు.

కౌలూన్ (హాంకాంగ్ దీవికి ఎదురుగా ప్రధాన భూభాగం) లో ఉన్న కొమింటాంగ్ చైనా తరఫున సంకోలు వసూలు చేసే కార్యాలయంలో పనిచేసే 22 మంది విదేశీయులు పరిస్థితులు అయోమయంగా ఉన్నందున ఉద్యోగాలను వదులుకొనటానికి నిశ్చయించారని హాంకాంగ్ వార్త ఒకటి వెల్లడిస్తున్నది.

# కొత్త రాజధాని చెంగ్టూపైకి కమ్యూనిస్టుల విజృంభణ

## ప్రభుత్వం పారిపోజాకుమారే అవకాశం

హాంగ్‌కాంగ్, డిసెంబరు 1: చైనా కమ్యూనిస్టులు యీ వేళ చెంగ్టూకు 116 మైళ్ల దూరంలో ఉన్న లుంగ్‌చాంగ్ అనే పట్టణాన్ని పట్టుకున్నారు. జాతీయ ప్రభుత్వం క్రొత్త రాజధానిలో ప్రవేశించి పూర్తిగా మూడు పూటలైనా గడవకుండానే మళ్ళీ అక్కడనుంచి పీఠం యెత్తుకొని పారిపోవలసిన గతి పట్టేట్లు ఉన్నది. చైనా నడిగడ్డమీద నిలవడానికి జాతీయ ప్రభుత్వానికి ఇక అస్కారంలేదు; తలదాచుకొనడానికి మొట్టమొదట చుంకింగ్ వెళ్లినా మొండిచేసుకొని ఫార్మోజా దీవికి పారిపోవడం ఒక్కటే నావ రక్షింపగల్గింది.

చుంకింగ్‌కు పడమరగా 98 మైళ్ల దూరంలో ఉన్న చుంకింగ్-చెంగ్టూ రాజమార్గమును లుంగ్‌చాంగ్‌లో వున్న కమ్యూనిస్టులు వశపరచుకున్నారు. కమ్యూనిస్టులు వల్ల దిద్దైన బాటమీద లుంగ్‌చాంగ్ నుండి హుటాహుటిగా నిచింగ్ వైపుకి ఎత్తివస్తున్నారు; నిచింగ్, చెంగ్టూకు 92 మైళ్ళ దూరం ఉంది. చుంగ్‌కింగ్ నుండి మరో సైనికశ్రేణి పశ్చిమ దిశగా సాగిపోతున్నది.

లీసుంగ్ జెన్‌వద్దకు రాయబారం వెళ్లిన తన మాతలు ఇద్దరూ తిరిగి వచ్చిన వెంటనే చాంగ్ కై షేక్ తానే చైనా అధ్యక్షపదవిని మళ్ళీ స్వీకరిస్తున్నట్లుగా ప్రకటించగలడని తెలియుచున్నది.

లీసుంగ్ జెన్‌ను రాజధానికి తిరిగివచ్చి తాత్కాలిక అధ్యక్షుడుగా వ్యవహరించవలసిందని చాంగ్ కై షేక్ దూతలు ప్రతిపాలనమూ ఆయన దానికి నిరాకరించడమూ పాఠకులు ఎరిగిందే. చుంకింగ్ పతన వార్త అధికారరీత్యా ధ్రువపడగానే చెంగ్టూలో వర్తక వ్యాపారాలు స్తంభించిపోయినవి; చెంగ్టూను భయసంక్షోభాలు ఆవహించినవి; నగరంలో ఆహారం ధర బంగారం ధర విపరీతంగా పెరిగిపోయినవి.

# కాశ్మీర్ సంఘ సభ్యులలో అభిప్రాయ భేదాలు

## నివేదిక తయారు చెయ్యడంలో ఆలస్యానికి కారణాలు

లేక్ సక్సెస్, డిసెంబరు 1: రెండు నెలలనించి నివేదిక తయారు చేస్తున్నా కాశ్మీర్ సంఘ సభ్యులింకా తమ నివేదిక భద్రతాసంఘానికి సమర్పించలేదు. కాశ్మీరసంఘ సభ్యులలో ప్రధాన విషయాలమీదగానీ, భద్రతాసంఘానికి ఇచ్చే సలహాల మీదగానీ ఏకాభిప్రాయం కుదరలేదని తెలుస్తున్నది.

సంఘసభ్యులలో కొందరు నివేదికలో కేవలం వాస్తవిక విషయాలే వ్రాయాలనీ, సంఘసభ్యులు ఇండియా పాకిస్తానులతో జరిపిన సంప్రతింపుల విషయం కూడా యథాతథంగా అందులో ఉదాహరించాలనీ అంటున్నారట.

మరికొందరు ఇండియా పాకిస్తానుల వైఖరులు, వాటివల్ల సంప్రదింపులలో వచ్చిన ఇబ్బందులు, వాటిమీద సంఘసభ్యులఅభిప్రాయాల కూడా విస్పష్టంగా వ్రాయాలనీ, వీటివల్ల భద్రతాసంఘం ఒక నిర్ణయానికి రావడానికి వీలవుతుందనీ, అన్నారట. అందుచేత ఈ రెండు అభిప్రాయాలు గలవారికీ ఏకీభావం కుదరలేదని తెలుస్తున్నది.

ఇలానే భద్రతా సంఘానికిచ్చే సలహాల విషయంలో కూడా అభిప్రాయ భేదం వచ్చిందట.

సభ్యులలో కొందరు అయిదుగురు సభ్యులుగల ఈ సంఘం భద్రతాసంఘానికి సలహాలివ్వడంవల్ల ఉపయోగం లేమిగేదని అందుచేత ఈ సంఘాన్ని రద్దుచేసి ఒక వ్యక్తిని నియమించి తద్వారా రాజీసంప్రతింపులు నడింపించాలని అభిప్రాయపడుతున్నారట.

మరికొందరు అడ్మిరల్ నిమిట్జ్ వంటి వ్యక్తిని రాజీ సంప్రతింపులకు ఏర్పాటు చేయాలనీ, అతడు అప్పుడప్పుడు తన కార్యక్రమ సాఫల్యం కాశ్మీర సంఘానికి నివేదిస్తూ ఉండాలనీ, ఇంకా కొంతకాలంపాటు కాశ్మీరసంఘం పనిచేస్తూ ఉండాలనీ, ఇది భారతదేశంలోనే ఉండవలసిన అవసరంలేదనీ అంటున్నారట. ఈ విభేదాలవల్లనే కాశ్మీరసంఘం నివేదిక తయారు చెయ్యడంలో ఆలస్యం అవుతున్నదని తెలుస్తున్నది.

ఇక్కడి అభిజ్ఞవర్గాలు కాశ్మీరసంఘ నివేదిక డిసెంబరు రెండవ వారంలో భద్రతా సంఘానికి అందజెయ్య బడవచ్చునని అనుకుంటున్నారు. కాశ్మీరసంఘ ప్రతినిధి ఒకరు డిసెంబరు 15 వ తేదీకి ఇక్కడికి రాగలరని వచ్చేటప్పుడు ఈ నివేదిక తమతోకూడా తీసుకురాగలరనీ అనుకుంటున్నారు. అయితే ఈ నివేదిక భద్రతా సంఘానికి అందడానికి ఇంకా కొంచెం ఆలస్యం అవుతుందనీ, అందుచేత ఈ సంవత్సరంలో భద్రతాసంఘం దీన్ని గురించి చర్చించక పోవచ్చుననీ తెలుస్తున్నది. క్రొత్త సంవత్సరంలో ఇండియాకు భద్రతాసంఘ సభ్యత్వం వస్తుంది. అయితే కాశ్మీర వివాదంలో ఇండియా కూడా ఉన్నది. కాబట్టి ఈ విషయంలో ఇండియా ఓటు చెయ్యదనికూడా తెలుస్తున్నది. కాశ్మీర చర్చకోసం సర్. మహమ్మద్ జఫ్రుల్లా ఖాన్ ఇంకా ఇక్కడే ఉన్నారు. ఆజాద్ కాశ్మీర నాయకుడు సయ్యద్ ఇబ్రహీమ్ గుర్మానీలు త్వరలోనే ఇక్కడికి రాగలరని కూడా తెలుస్తున్నది.

(4-వ పేజీ చూడుడు)

# "వలసరాజ్య పరిస్థితులను సమితికి నివేదించాలి"

## పాలకదేశాలకు సమితి ఆదేశం

ఫ్లషింగ్ మెడో, డిశంబరు 2: వలసరాజ్యాల ప్రజలకు ప్రాథమికహక్కులు ఎంతవరకు ఉన్నదీ, ఆ రాజ్యాల చారిత్రక భౌగోళికవివరాలనూ, తమకు పాలక దేశాలు తప్పనిసరిగా నివేదించవలసినదని ఐక్యరాజ్య సమితి ఈవేళ బ్రిటన్ మొదలైన పాలక దేశాలకు ఆదేశించినది.

ఇంతవరకు ఈ అంశాలమీద నివేదికలను సమర్పించటమన్నది పాలకదేశాల ఇష్టానిష్టాలకు వదిలివేయబడేది.

పాలకదేశాలు సమర్పించిన వివరాలను పరిశీలించటానికి ఏర్పాటు చేయబడ్డ ప్రత్యేక సంఘం మరిమూడు సం॥ల వరకూ పని చేయవలెనని సమితి తీర్మానించినది. వలస దేశాలు ఇకమీదట పరిపాలితదేశాలు కావని పాలకరాజ్యాలు ప్రకటించి, వివరాలను సమర్పించటం నిలిపివేసినట్లయితే దానిమీద తన అభిప్రాయాన్ని వెల్లడించే అధికారాన్నికూడా ప్రత్యేకసంఘానికి సమితి ఇచ్చినది.

తీర్మానాలన్నిటినీ, పాలక రాజ్యాలు ప్రతిఘటించినా కాని నెగ్గలేక పోయినవి.

(5 వ పేజీ చూడుడు)

# "ఐక్య ఇండొనీషియా హాలెండుల మధ్య సమష్టిరక్షణ పద్ధతి వుండదు"

## అధికార ప్రదానానికి డచ్చి ప్రభుత్వ బిల్లు

హేగ్, డిసెంబరు 2: ఇండొనీషియా స్వాతంత్ర్య ప్రదానపు బిల్లులోని వివిధ అంశములను సమగ్రంగా వివరిస్తూ డచ్చి ప్రభుత్వం ఈవేళ ఒక నివేదికను ప్రచురించింది. నెదర్లాండ్సు ఇండొనీషియా యూనియనూ దేనికది విడివిడిగా తన స్వంత రక్షణ విధానాన్ని అవలంబిస్తుందనీ, ఉభయులకు కలిసి ఒక సమష్టిరక్షణ విధానం అంటూ ఉండదనీ, ఈ నివేదికలో డచ్చి ప్రభుత్వం స్పష్టీకరించింది.

"సంయుక్త రక్షణ విధానాన్ని ఏర్పాటు చేసుకొనుటకు ఇంకా అదను రాలేదు. ఈవిధమైన వర్గీకరణగురించి ఆలోచించడానికి ఇండొనీషియా నాయకులు ఇప్పుడే సంసిద్ధంగా లేరు. కమ్యూనిస్టు ముప్పును నూతనరాజ్యం తనకుతానే ఎదుర్కోవలసి ఉంటుంది; అయితే, ఈపనిలో తోడ్పడడానికి ఇండొనీషియా రిపబ్లికు తనకిష్టం వచ్చిన ఏ రాజ్యాన్ని అయినా సైనికసహాయం అడిగి పుచ్చుకోవచ్చును."

డచ్చిప్రభుత్వం తన సైన్యాలను న్యూగినీలో అధికసంఖ్యాకంగా కేంద్రీకరించదలచలేదన్న మాట పర్యాబద్ధం. ఇలా చేయవలసిన అవసరమేమీ మాకు కనిపించడంలేదు. ఇండొనీషియానుండి సైన్యాలను ఉపసంహరించడమే ప్రస్తుత కర్తవ్యం. ఆంతరంగిక రక్షణబాధ్యతను నూతన రాజ్యమే స్వయంగా వహించవలసి ఉంటుంది. డచ్చిప్రభుత్వం ఇండొనీషియాకు అరువు ఇచ్చే నౌకలమీద డచ్చి పతాకతోపాటు ఇండొనీషియా పతాకను కూడా ఎగురవేయడానికి అభ్యంతరం ఉండదు. అయితే డచ్చి పతాకను ప్రధాన ధ్వజస్తంభంమీద ఇండొనీషియా పతాకను ముందుభాగంలో ఉండే స్తంభంమీద ఎగురవేయాలి. ఇండొనీషియా డచ్చి పతాకలు రెండు ఈవిధంగా కలిసి ఎగరడం జూలియానా రాణి ఆధ్వర్యమున ఏర్పడిన నూతన రాజ్య కూటమిలోని రెండుభాగాల మధ్య అన్యోన్య సహకారానికి సంకేతంగా ఉండగలదు."

ఆర్థిక ఒడంబడిక ఇండొనీషియాకు వాటంగా ఉన్నదన్న ఆరోపణగూర్చి ప్రస్తావిస్తూ, నెదర్లాండ్సు చాలా త్యాగం చేసినమాట వాస్తవమేననీ, కాని రౌండు టేబుల్ సమావేశం విఫలంఅవటం ఇష్టం లేక ఈ నష్టం పెట్టుకోడానికి తాము చివరకు అంగీకరించవలసి వచ్చిందనీ, ప్రభుత్వం తెలియజేసింది. ఇతర ఋణదాతలు కూడా ఇండొనీషియాపట్ల తమవలెనే ఔదార్యం ప్రదర్శించగలరని ఆశిస్తున్నా

(4-వ పేజీ చూడుడు)

# ముక్డెన్‌లో అమెరికన్ కాన్సల్ జనరల్

వాషింగ్టన్, డిసెంబర్ 2: ముక్డెన్ (మంచూరియా)లో ఉన్న అమెరికన్ కాన్సల్ జనరల్ అంగస్‌వార్డ్, అతని సిబ్బంది వచ్చే బుధవారంనాడు పొద్దున 8 గంటలకల్లా నగరంవిడిచి వెళ్ళిపోవాలని కమ్యూనిస్టు అధికారులు ఉత్తరువు చేసినట్లు అమెరికా విదేశాంగ కార్యాలయం నేడు వెల్లడించినది.

# ఆంధ్రజాతీయ పునరుజ్జీవనం

భారత ప్రభుత్వ హోంశాఖా కార్యదర్శి రాష్ట్ర ప్రభుత్వానికి వ్రాసిన లేఖలో పేర్కొన్న వివిధ సమస్యలు పరిష్కారం కాగానే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరుగుతుంది. 1950 జనవరి 26 నాటికి కాకపోయినా 1950 ఏప్రెల్ 1 వ తేదీ నాటికి ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడవచ్చు. స్వాతంత్ర్య ప్రాప్తితో భారతీయుల బాధ్యతలు పెరిగిపోయినట్లే, రాష్ట్రం ఏర్పడటం వల్ల ఆంధ్రుల బాధ్యతలూ అధికమౌతవి. రాజకీయార్థిక వ్యవహారాలనే గాక, అనేక ఇతర సాంస్కృతిక వ్యవహారాలను కూడా నూత్న ప్రభుత్వం విచారించవలసి ఉంటుంది. ఈ వ్యాసం, శ్రీ భావరాజు కృష్ణారావుగారు వివరించినట్లు ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనమే ఆంధ్రులు సాధింపవలసిన మొదటిపని. ప్రత్యేక రాష్ట్రం అందుకు సాధన కావాలి. రాష్ట్రం ఏర్పడే నాటికి ఆంధ్రులీ విషయాన్ని సావధానంగా, సమగ్రంగా విచారించి ఒక అభిప్రాయానికి రాగలరనే ఉద్దేశ్యంతో ఈ వ్యాసాన్ని ఇప్పుడే ప్రకటిస్తున్నాము.

—సంపాదకుడు.

ముప్పయి ఆరేండ్లు, తెలుపలేనంతగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రము కొరకు యుననితపస్సంతయు ధారవోసి, ఆందోళనజరిపి, ఏలాగుననో, ఈనాటికి ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రోదయమును కంటజూచినారు. రమణీయమైన ఉషఃకాలము వచ్చెనన్నది. రాష్ట్ర మేర్పడినదన్న వార్త వచ్చిన యీ శుభదినములు. చీకటియందు పండుగొందును గాకనల్లాడినవారికి, ఉషఃకాలము, తరువాత అరుణోదయము ఎంత ఆనందమును కల్గించునో బాధపడినవారికి తప్ప ఇతరులకు తెలియదు. ఆనందాతిరేకమున ఉత్సాహముతో భాగ్యోదయమయిన ఆంధ్రుడు భావికాలమును గూర్చి ఊహాలల్లుచున్నాడు.

ఇన్ని యేండ్లు ఆంధ్రులెందుకొరకు ప్రత్యేక రాష్ట్రమును కావలయునని యాందోళనము జరిపినారు? అన్న యీ ప్రశ్నకు సమాధానము ఊహించుటకు ముందు, ఆంధ్రోద్యమమును ఒకసారి సింహావలోకనము చేసుకొనుటావశ్యకము. సింహావలోకనము జేసినపిదప నా ప్రశ్నకు సమాధానము దానియంతట అదే మనసుకు గోచరించును. ఆంధ్రులు తమకొక ప్రత్యేక రాష్ట్రముండినగాని, తమ ఇష్టము వచ్చిన తెలుగున యథేచ్ఛగా తమ ప్రతిభాలతికను, తమ సంస్కృతి సంప్రదాయానుసారముగ వర్ధిల్లచేసి, సంపూర్ణమైన ఆర్థిక, పారిశ్రామిక, రాజకీయ, విద్యావిషయిక వ్యవసాయకేత్యాది విషయములందు అభివృద్ధి పొందజాలమని గ్రహించి ప్రత్యేక రాష్ట్రము కొఱకు తీవ్రముగ ఆందోళన సలిపిరి. చెన్న రాష్ట్రము నుండి విడిపోయి ప్రత్యేక రాష్ట్రముగ నేర్పడినంతమాత్రమున, ఆంధ్రరాష్ట్రము, ఆంధ్రులు భారతీయ ఐక్యతకు భంగము వాటిల్లగలదని భయవిహ్వలురై కొందరు ఆంధ్రరాష్ట్ర సంపాదనకు ఎన్నియో ఆటంకములు కల్పించిరి. ఇంకను కల్పించుచున్నారు. ఇది త్రాడును చూచి సర్పమని భ్రాంతి పడుటవంటిది. కాని ఈ ఆటంకములు గల్గించువారిలో, ఉన్నవని యూహించువారిలో సగము పంతము కాకు ఈర్ష్యవలనే.

కాంగ్రెసు భాషాప్రయుక్త రాష్ట్రములునాడే ఏర్పరిచి, రాజకీయాందోళనను జరిపి యుండెను. ప్రత్యేక రాష్ట్రము, లేనికారణమున ఆంధ్రులు తమిళులకంటె, అనేక విషయముల ముప్పయి సంవత్సరముల వెనుకబడియున్నారు.

కాని చెన్నరాజధానిపరిస్థితులు ఆంధ్రులకు అవకాశములను లేకుండజేసెను. ఆ తరుణమును పురస్కరించి మళయాళీలు పరుగుపరుగున ముందంజవేసిరి. అన్ని హంగులు కలిగియున్నను ఆంధ్రుడే పరుగులో వెనుకపడవలసివచ్చెను. పురోభివృద్ధిలో వెనుకబడినాడుగాని ఆంధ్రుడు ప్రజ్ఞాహీనుడని అపఖ్యాతిపాలుగాలేదు. ఆర్థికముగా ఆంధ్రదేశము చాలా 'బీదస్థితి'యందున్నది. ప్రజలవద్దర ఉండవలసినంత ధనకనకము లేమిలేనికారణమున వర్తకము, ఆంధ్రదేశపు వర్తకములో నాల్గింట మూడుపాళ్లు ఆంధ్రేతరుల స్వాధీనమై పోయినది. చాలినంత ధనములేని కారణమున, ప్రజలలో సహకార సహాయబుద్ధి, పరస్పర విశ్వాసము, మొదలయిన సాంఘిక సహాయ జీవనము కొఱత యేర్పడినది. ధనము, వర్తకము, లేనికారణమున పరిశ్రమలు వెనుకబడినవి. ఆంధ్రదేశమున నేటి వఱకు ఒక సిమెంటు పరిశ్రమతప్ప మరియొక పరిశ్రమ లేదు. ఆంధ్రదేశమున ఏ పరిశ్రమయు అభివృద్ధిపొందుటకు అవకాశములు నేటివఱకు లేకుండబోయినవి. బ్రిటిషువారి పరిపాలనమునాడు మద్రాసుకు అని యేది కేటాయించినను దాని లాభము ఉపయోగము ఎప్పుడు తమిళ జిల్లాలకే చెందుచుండును. వస్త్రముల, యంత్ర పరిశ్రమ, చేనేత పరిశ్రమలు రెండును కోయంబత్తూరు మధురపట్టణములందే విస్తరించెనుగాని రాయలసీమకు, అంత ప్రత్తి పండించు రాయలసీమలో, ఒక్కచోటనయినను వస్త్ర చేతపరిశ్రమ కాలుపెట్టలేకపోయెను. రాయలసీమ ప్రత్తి పంటనుగూడ మద్రాసుప్రభుత్వము పనిరానిపాట్లు పెట్టినది. ఈవిధముగానే పరి-

**శ్రీ భావరాజు కృష్ణారావుగారు**

శ్రమయను తెలియకుండపోయెను. ఒక పరిశ్రమలేకాదు రైలుమార్గములు కూడ క్రొత్తవి. అఖిలాంధ్రదేశమునకు సంబంధించిన రైలుమార్గము ఒక్కటిగూడ యీ శతాబ్దములో వేయబడియుండలేదు. ఉదాహరణములను రెండింటిని మాత్రము దీసుకొనుడు. ఎన్ని రైలుమార్గములయినను దేశమునకు అడ్డముగాను, నిలువుగాను తమిళనాడులోనున్నవి. ఆంధ్రదేశమున ఒక్కటియును లేదు. నెల్లూరినుండి కడప, కడపనుండి రాయచోటిమీదుగా పెనుగొండకు గాని అనంతపురమునకు గాని రైలుమార్గము అవసరము అక్కరలేదా, ఒంగోలునుండి, కంభమునకు లేక మార్కాపురమునకు నంద్యాలనుండి బంగనపల్లి కోయిలకుంట మీదుగా కడపకు, ఆవిధముగ అనంతపురమునుండి గుత్తి, మీదుగా [illegible] కలిపిన [illegible]

[illegible] తిని, అన్నిటిని ముందుకుతెచ్చి, ఆంధ్రరాష్ట్రము భాగ్యవంతమును, సకలాభీష్టప్రదాయినిగను జేయవలయును. తమరాష్ట్ర సంపాదనము, భారతీయ ఐక్యతకు భంగము కలిగింపలేదని ఆంధ్రులు కార్యరూపమున ఋజువు చేయవలెను. ఆ ప్రత్యేకాంధ్ర రాష్ట్రము భారత భాగ్యమునకు భారతీయ ఐక్యతకు ముఖ్యకారణమని ఋజువు చేయవలెను.

పరరాజుల జయించి పరరాజ్యములను ఆక్రమించి, పరధనములను కొల్లగొట్టుట ఒక ప్రజ్ఞయనియు, జయించిన రాష్ట్రములనుతన రాజ్యమునందు చేర్చి, రాష్ట్రపరిపాలనము ప్రజానురంజకముగ చేయుటయు, పరిపాలనా నిర్వహణదక్షత కలిగియుండుట మరియొక రీతి ప్రజ్ఞయనియు చరిత్ర మనకు దెలిపినసందేశము. బ్రిటిషు సామ్రాజ్యముతో, స్వాతంత్ర్య సంపాదనకై సహాయనిరాకరణోద్యమము సాగించి స్వాతంత్ర్యము సంపాదించినది యొక యెత్తు, సంపాదించిన స్వాతంత్ర్యమును చక్కగ సుపయోగించుకొని అభివృద్ధిగాంచుట రెండవ ఎత్తు. యుద్ధమునందు రణకౌశలమును, సైన్య వ్యూహములను రచించు కౌశలమును జూపి జయలక్ష్మిని గొన్న సేనాని, రాజ్యభారనిర్వహణమున వేరొక రీతి కౌశలమును చూపవలయును. యుద్ధము గెలువజాలిన దండనాయకుడు, రాజ్యపాలనమున నిపుణుడగును. ద్వితీయ ప్రపంచ మహాయుద్ధమును గెలువజాలిన విన్స్టన్ చర్చిలో, యుద్ధానంతరమున రాజ్యభారము బూనగల దక్షత జూపలేకపోయెను.

భరత ఖండమునకు స్వాతంత్ర్యమును సంపాదించిన మహానాయకులు, ఆంధ్ర రాష్ట్రమును సంపాదించిన మహానాయకులు, ఉద్యమమును ఆందోళనము జరిపిన కాలము నాటి పద్ధతులను విడిచిపెట్టవలెను. రాష్ట్ర సంపాదన మొకశక్తి, ఏర్పడిన రాష్ట్రమును చక్కదిద్దుటకు మరియొక శక్తి. ఒకదానితో నింకొకదానికి సంబంధము లేదు. రాష్ట్ర సంపాదనమునకై ఎన్ని సన్నాగములు, వేసిన యెత్తులు, జరిపిన యాందోళనము, రాష్ట్ర నిర్వహణము కార్యమున నిరుపయోగములు. ఈ రెండవ కార్యమునకు వేరొక రకపు నాయకులు, వేరొకమాదిరి కార్య నిర్వహణ దక్షత కావలయును. నాయకులు ప్రజలు గూడ నీవిషయమును గమనించవలయును. కాలము పరిణామమును మార్పును ఎడతెగక గొనివచ్చుచుండును. కాలానుసరణముగ వచ్చు మార్పును గమనించని జాతి, ప్రజ, నాయకులు, పురోభివృద్ధిని గాంచలేరు.

నూతనముగా నేర్పడిన ఈ పరిస్థితులను గుర్తెరిగి భవిష్యత్కార్య సాఫల్యమునకు పునాదులు వేయు [illegible] నాయకులు కాలమును [illegible] అతని పురోభివృద్ధి మార్గమును అనుసంధింపు ప్రజలును కాలము వచ్చిన పరిణామమును, మార్పును గమనించుచు బోవలయును.

ఆంధ్రరాష్ట్ర మేర్పడునని మంగళ తూర్యారావము వినవచ్చుచున్న శుభసమయమున చక్కని మేలుకొలుపులు, చక్కని గానముతో, వినబడవలయును. అచిరకాలములో రూపము దాల్చి ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్రము, అఖిలాంధ్ర భూమిని తనలో జేర్చుకొన్న బృహదాంధ్ర రాష్ట్రముయొక్క సౌష్ఠవమైన రూపమును, ఆ రాష్ట్ర సౌభాగ్యమునకై చేయవలసిన కార్యములను, అన్నింటిని ఆంధ్ర జాతి హృదయమునందు ప్రతిఫలింపవలెను. సంకుచితభావములను, వినాశహేతువులయిన సంశయములను, అనుచితములయిన ఈర్ష్యలను, మనసులనుండి పారద్రోలి అన్ని విషయములను విశాల హృదయములతో, విశాల దృష్టితో, సమభావములతో జూచి యాంధ్రాభ్యుదయమునకు తోడ్పడు శక్తి ఆంధ్రులకు అలవడవలెను. ప్రతియుగమునందును, ప్రాతపద్ధతికి స్వస్తి చెప్పి క్రొత్తవిధానమునకు స్వాగతమిచ్చి విఘ్ననాయకుని పూజ యొనర్చిననాడు ఒక సంధిగావస్థ యేర్పడును. ఆ సంధిగావస్థను గుర్తింపగలవాడు దక్షుడు - ప్రాత క్రొత్తల కలయికయందు ప్రాతవాటిమీద గాని, అనవసరాభిమానము గాని, క్రొత్త మాటయందు విపరీతాభిమానము గాని కూడదు. ప్రాత క్రొత్తల కలయికయందు, మంచివిషయములనే ఏర్చి, కూర్చి యుంచుకొనవలయును. అట్టిశక్తి యలవడినగాని క్రొత్తకాలము సుఖప్రదము గాజాలదు. భారత రాజ్యాంగమునందు ప్రాతక్రొత్తల కలయికయందు, కాంగ్రెసు క్రొత్తకాలం యొక్క రూపమును, సత్యరూపమును చిత్రించుకొన జాలకున్నది. ఊహించుకొనుటకు గూడ శక్తి జాలక యున్నది. ఇట్టి దుస్థితి యాంధ్రజాతికి, యాంధ్ర రాష్ట్రమునకు సంభవింపకుండును గాక.

నూతన యుగము ఆరంభమగుచున్నది. ఈ సంధి సమయమున జాతికి పునర్జన్మము గూడ అవశ్యకము. పునర్జీవనమున శైశవము, బాల్యము, యౌవనము, కౌమారము గూడ నున్నవి. మొదటి మూడు దశలందును పునర్జీవనము నొందిన ప్రతి జాతియు, నరునివలెనే, అమితశక్తి, తేజములను గలిగియుండును. ఏ కార్యమునైన సాహసముతో, ధైర్యముతో, సాధింప సమర్థత గలిగియుండును. కావున ఈ సంధి సమయమున, ఆంధ్రజాతికి నూతనముగ శక్తితేజములను ఆవేశింప జేయగల దక్షత గల నాయకుడు, సృష్టి చేయగల స్రష్ట తేజశ్శక్తులుపోయు వీరుడు గావలయును, అట్టివాడుదయించుటకు గూడ పునర్జీవనము అవశ్యకము.

పునరుజ్జీవనము ఒక రాజకీయరంగము నందే గాక, జాతికి అన్ని శాఖలయందును ఆవిర్భవించవలసియున్నది. అన్ని శాఖల యందు ఏకకాలమున సమముగా పునరుజ్జీవనము తెలిసి విస్తరించినగాని జాతికి పురోభివృద్ధిలేదు. ప్రాతకాలపునాటి చీకటులు క్రమ్మించిన సంశయములు తొలగిపోవలయును. అంతట దేశభక్తి, దేశసౌభాగ్యముపై విశాల దృష్టి నూతనోత్సాహము, ఆత్మ విశ్వాసము, పరస్పర సహాయము ఇత్యాది నూతన భావములు పునరుజ్జీవనమునకు ప్రాణములవంటివి. వాటిని దేశమునందు జనులందు వ్యాపింప జేయగలవాడు వీరుడు. అట్టివాడు జాతిపునరుజ్జీవనమునకు స్రష్ట కాగలిగినవాడు అతడు కవి గావచ్చును, నాయకుడు గావచ్చును, పత్రికాధిపతి కావచ్చును. చారిత్రకుడు గావచ్చును, వర్తకుడు గావచ్చును, కోటీశ్వరుడు గావచ్చును. ఎల్లరకు లక్ష్యము గమ్యస్థానము ఒక్కటి గదా! జాతికి పునరుజ్జీవనము కలిగిననాడు ఆంధ్రజాతికి ఎక్కడజూచినను వసంతోత్సవములే జూడగల్గుదుముగదా!

# ఆంధ్రదేశపు ఆర్థిక పరిణామం

ఇతర రాష్ట్రాలతో పోల్చిచూస్తే ఆంధ్రరాష్ట్రం పారిశ్రామికంగా, ఆ కారణంగా ఆర్థికంగా ఎంతో వెనుకబడి ఉన్నట్లు స్పష్టమాతుంది. ఇందుకు ప్రధాన కారణం, మన దేశంలో పారిశ్రామిక యుగం ప్రారంభమయ్యే నాటికి మన రాష్ట్ర వ్యవహారాలను సరిదిద్దుకునే అవకాశం, అధికారం మనకు లేకుండా పోవడమే. విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు, ఇర్రిగేషన్ ప్రాజెక్టులు ఇక ఏర్పడవలసి ఉన్నవి. వ్యాపారాభివృద్ధికి పరిశ్రమల అభివృద్ధి అవసరం. బ్యాంకుల స్థాపన, వరవతి సౌకర్యాలు అంతకంటే ఎక్కువ అవసరం. ఈ వ్యాసంలో శ్రీ జె. వి. సోమయాజులుగారు రాష్ట్రం వచ్చిన తరువాత ఆంధ్రులు ఆర్థిక, పారిశ్రామిక వ్యాపారాభివృద్ధిని సాధించడానికి ఏమార్గాన్ని అనుసరించి ఏయే పనులు చేయవలసి ఉంటుందో ఇందులో చక్కగా వివరించారు. ఇప్పట్నుంచీ మనం ఈ విషయాలను పరిశీలించి ఒక పథకాన్ని తయారు చేసుకోవలసి ఉంది గనుక ఆంధ్రరాష్ట్రం ఏర్పడనున్న ఈ సమయంలో దీన్ని ప్రచురిస్తున్నాము.

—సంపాదకుడు.

36 సంవత్సరములుగ, ఆంధ్రులు వాంఛించుచున్న ప్రత్యేకరాష్ట్రము నేటికిసిద్ధించకున్నదని ఆంధ్రులందరు చింతించుచుండిరి, ఆంధ్రుల రాజకీయ, ఆర్థిక విజ్ఞానపరిణామాభివృద్ధికి, ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము లేకపోవుటచే, కలుగుచుండిన, నిరంతర అంతరాయములు, ఎల్లరకును విదితమే. రాజకీయ, విజ్ఞాన, రంగములయందు, ఆంధ్రప్రముఖులలో కొందరు అద్వితీయమైన జగద్విఖ్యాతిని, పొందగల్గినను, ఆంధ్రులందరు ఏకగ్రీవముగ, 'మహాత్ము'నికి పాదచారులై వారికి జోహారులర్పించి రాజకీయసంగ్రామమున అందరికంటె ముందంజవేసి అష్టకష్టములకు లోనయి, అపారదేశభక్తిని వెల్లడించినను, నేడు భారత రాజ్యాంగమున, ఆంధ్రులకు తగినంత, ప్రాతినిధ్యము గలుగకపోవుటకు ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము లేకపోవుటయే ముఖ్యకారణమని తలచుటలో, అతిశయోక్తి లేదనవచ్చు. అందు ముఖ్యముగ, ఆంధ్రరాష్ట్రము, ఆర్థిక, పారిశ్రామిక రంగములలో, భారతదేశమునందున్న, వివిధప్రాంతములకంటె చాల వెనుకబడియుండుటకు, ప్రత్యేకరాష్ట్రము లేకపోవుటయే ముఖ్య కారణమని నిర్వచించుట, నిర్వివాదాంశము. ఆంధ్రులు చిరకాలమునుండి బ్రిటిషు ప్రభుత్వమునకు (1857 నుండి) మిత్రవర్గములో చేరినవారు కాకపోవుటచేతను, మదరాసు రాష్ట్రప్రభుత్వమున అనాదిగ, అనేక కారణములవల్ల, ఆంధ్రేతరులే అధిక సంఖ్యాకులుగచేరి, వారు బ్రిటిషు ప్రభుత్వ పరిపాలకులవద్ద హెచ్చు పలుకుబడిని సంపాదించుకొనుటవల్లను, ఆంధ్రులు తమ దేశపు సర్వతోముఖాభివృద్ధికి, వలయు దోహదమును, సాధనసంపత్తిని చేకూర్పజాలకుండిరి.

ఆంధ్రదేశము, ఆర్థిక సంపత్తియందు భారతదేశమునందలి ఇతరప్రాంతములకంటె ఏ మాత్రము, వెనుకబడి యుండలేదు. ఈ రాష్ట్రపు ఆర్థిక సౌష్ఠవమును పెంపొందించుటకు వలయు సాధన సంపత్తి అంతయు ఇచ్చట నేగలదు. మిగత రాష్ట్రముల వలెనే, ఈ రాష్ట్రమునందుకూడ వ్యవసాయ సంపదయే మెండు. ఇచ్చట షుమారు 1 కోటి 75 లక్షల ఎకరములు సాగుబడియందుండెను. బియ్యము, జొన్న, రాగులు మొదలగు ఆహార పదార్థములు, వేరుశనగ, ప్రత్తి, పసుపు మొదలగు ముడిపదార్థములు మెండుగ ఈ రాష్ట్రమునపండుచున్నవి. ఈ రాష్ట్రము పుష్కలముగ ఇట్టి వ్యవసాయ సంపదతోనేగాక, అమూల్యమగు ఖనిజ సంపత్తుతో కూడ తులతూగుచుండెను. అభ్రకము, మాంగనీసు, [illegible] విశేషముగ దొరకుచుండెను. వీటితోపాటు ఇనుము బొగ్గు మొదలగు అత్యవసరపు ఖనిజములుకూడ ఇచ్చట భూగర్భమందున్నవని శాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. ఇవియేగాక ఆంధ్రరాష్ట్రము విశేషమగు అరణ్యసంపదను కలిగియుండుటచే, ప్రత్యేక విశిష్టతను చెందియున్నది.

ఆర్థిక సౌష్ఠవమునకు కావలసిన సర్వవిధ సాధనసంపత్తియు ఈ దేశమునందు పుష్కలముగ లభించుచున్నను, నేడు ఆంధ్రదేశపు ఆర్థిక పరిణామము వికాసము చెందియుండక పోవుటకు ముఖ్యకారణము ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రము లేకపోవుటయేనని రెట్టించనావశ్యకములేదు. ఈ దేశమునందు సాగుబడిలోయున్న 175 లక్షల ఎకరములలో, షుమారు 40 లక్షల ఎకరములకు మాత్రమే కృష్ణా గోదావరి ఆనకట్టల వలన ఏర్పడిన నీటివసతులచే సాగుబడియగుచుండెను. షుమారు 30 లక్షల ఎకరములు, బావులు, చెరువుల సహాయమున సాగు చేయబడుచున్నవి. మిగిలిన ఒకకోటి ఎకరముల సాగుబడి కేవలము వరుణదేవుని దయాధర్మములపై నాధారపడియుండెను. ఈ దేశమున సరియైన నీటివసతులు కల్పించినచో, నూతనముగ సాగునకు కొన్ని లక్షల ఎకరములను తీసికొని రావచ్చును. ఈ వ్యవసాయదారులను తమ పంటలను, సక్రమమైన ధరలు వచ్చువరకు దాచుకొనుటకు సరియైన కట్టడములుగాని, హెచ్చు ధరలకు అమ్మకమునకు వీలగు ప్రదేశములకు ఈ సరకులను రవాణాచేయుటకు సరియైన, రోడ్లు, కాలువలు, రైల్వేగాని, కావలసినంతగ లేవు. ఆంధ్రదేశపు పదకొండు జిల్లాలలో గలున్న వసతులను, మద్రాసు రాష్ట్రమునందున్న ఇతర జిల్లాలతో పోల్చిచూచిన యెడల, సాగుబడి వసతులయందేమి, రోడ్లు, కాలువలు, మొదలగు రవాణా సౌకర్యముల యందేమి, రైలు మార్గముల యందేమి, ఆంధ్రదేశము వెనుకబడి యుండుటను విషయము తేటతెల్లము గాకమానదు. పూర్వము కృష్ణా, గోదావరులకు కట్టిన ఆనకట్టలు, అప్పటినుండి తవ్విన కాల్వలు తప్ప ఈ మధ్యకాలమునందు విశేషముగ మద్రాసు ప్రభుత్వము ప్రస్తుతము కొనసాగించి, ఆంధ్రదేశమున వ్యవసాయాభివృద్ధికి దోహదమొసంగినట్లు కానరాదు.

తుంగభద్రా ప్రాజెక్టు, అనేక కారణముల వలన మద్రాసు ప్రభుత్వము ప్రారంభించెను. ఇది పూర్తి అగుటకు ఇంకనుకొన్ని సంవత్సరములు పట్టును. రామపాదసాగరు ప్రాజక్టు, ఎటుల ఉపసంహరింపబడినదీ ఆంధ్రులెల్లరకును విదితమే. కోట్ల కొలది మొత్తాలను వెచ్చించ నవసరములేని, చిన్న చిన్న ప్రాజక్టులను సయితము మద్రాసు ప్రభుత్వము ఉపేక్ష చేయుచూ వచ్చెను. గండికోట, అక్కిలేరు, తమ్మిలేరు, ఏలేరు, బుడమేరు, అనుముల లంక, గుండ్లకమ్మ, పులికొండ, రాళ్ళపాడు, మొదలయిన ప్రాజెక్టు లన్నింటిని, ఉపేక్ష చేయుచూ వచ్చిరి. అందుచే నేటికి కూడ రాయలసీమ వారు పదేపదే క్షామదేవతచే

**శ్రీ జె. వి. సోమయాజులుగారు**

పీడింపబడుచూ ఉండవలసిన దుస్థితి నుండి విముక్తి కాలేకుండను, ఉత్తర సర్కారు జిల్లాల వారు వరదలచే అనేక మారులు తమ ధన ధాన్య పశు సంపదను కోలుపోవు పరిస్థితులను మార్పు చేసికొనజాలకుండను ఉండిరి. షుమారు 50 సంవత్సరముల క్రిందటే ప్రతిపాదించిన బుడమేటి ప్రాజెక్టును, పూర్తి చేయించి యున్నచో, సర్కారు జిల్లాల వారు ఈ సంవత్సరము పొందిన ఘోరబీభత్సమును పొందియుండవలసి యుండెడి వారు కదా!

ఈ దేశమున వ్యవసాయాభివృద్ధికే సరిగ దోహదము చేయక పోవుటయే గాక, ఇచ్చట దొరకు ఖనిజసంపదలనైన సరిగ ఉత్పత్తి చేసి పలువిధములగు పరిశ్రమల నిర్మాణమునకైనను, మద్రాసు ప్రభుత్వము తగినచేయూత నీయజాలకపోయెను. కనీసం ఏ ఖనిజము ఏ ప్రాంతమున ఎంతెంతవరకునని అంచనా వేయుటకైన సరియైన శాస్త్రజ్ఞులను అన్ని జిల్లాలలోను నియమింపబడినట్లు కనబడుటలేదు. పరిశ్రమలయందు ఆంధ్రదేశము, భారత దేశమునందున్న ఇతర ప్రాంతములకంటెనే గాక, మద్రాసు రాష్ట్రమునందలి ఇతర ప్రాంతములకంటె, విశేషముగ వెనుకబడియుండెను.

మద్రాసు రాష్ట్రమునందు నేడు వివిధ పరిశ్రమలయందు షుమారు 2500 జాయింటుస్టాకు కంపెనీలు గలవు. అందు తెలుగు జిల్లాలలో షుమారు 250 కంపెనీలుమాత్రమే యుండెను. ఆంధ్రదేశమునందున్న కంపెనీల మూలధనమంతయు కలసి, అయిదు కోట్ల రూపాయలకు మించదు. ఈ కంపెనీల విలువ, నేడు మూలధనమునకు సరిపోవునట్లు కూడ కనుపించుటలేదు. మిగతా జిల్లాల యందున్న కంపెనీల మూలధనము షుమారు 78 కోట్ల రూపాయిలుండెను. నేడు ఈ కంపెనీల విలువ కనీసము రు. 150 కోట్లుండును. ఆంధ్రదేశమున అయిదులక్షల రూప్యములకు పైగా పెట్టుబడి గలిగిన కంపెనీలు, షుమారు 30 మాత్రమే గలవు. ఈ కంపెనీలకు వచ్చిన వాటాధనములో సగము పైగా ఆంధ్రేతరులవద్దనుండియే వచ్చెను. నేడు ఆంధ్రదేశమునందు రెండు సిమెంటు ఫ్యాక్టరీలు, 13 విద్యుచ్ఛక్తి పంపకము చేయు కంపెనీలు, ఎనిమిది పంచదార ఫాక్టరీలు, షుమారు 200 వందలు బియ్యపుమరలు, రెండు ఇంజనీరింగు యంత్రాగారములు, రెండు పింగాణీ పరిశ్రమలు, ఒక మందుల కంపెనీ మరికొన్ని చిన్న పరిశ్రమలు మాత్రమే గలవు. ఇవిగాక నూనెమరలు రసాయన పరిశ్రమలు, మరికొన్ని చిన్న పరిశ్రమలు ఇచ్చటగలవు. ఈ రాష్ట్రమందున్న ఒక కాగితపు ఫ్యాక్టరీ నేడు నామమాత్రావశిష్టమై, ప్రభుత్వపాలన క్రిందకు పోయి, ఏదో ఒక రకమును కాగితమును, దినమునకు రెండులేక మూడు టన్నుల వంతున తయారుచేయు చుండెను. వనస్పతి పరిశ్రమ కొద్దిదినములలో ఉత్పత్తిని ప్రారంభించును. ఇచ్చట ప్రత్తిపంట విశేషముగ యున్నను బట్టల మిల్లులు ఈ దేశమున లేనే లేవని చెప్పవచ్చును. గోదావరి జిల్లాలో

(8 వ పేజీ చూడుడు)

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు॥ చతుర్దశి

1949 సం॥ డిసెంబరు 4 ఆదివారం

ఆ॥ చతుర్దశి సా 7-8 కృ రా 1-9 వర్జ్యం ప 11-57 ల 1-43 వ.

శు॥ పౌర్ణమి డిసెం॥ 5 సోమవారం పౌ॥ పౌర్ణమి రా 8-43 రోహిణి రా 3-6 వర్జ్యం సాయం 6-27 ల 8-11 వ.


# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర శు॥ చతుర్దశి

ఆదివారం


## వెల్లోడి ప్రభుత్వ కర్తవ్యము

హైదరాబాద్ సంస్థానమున, ఎట్టి అర్భాటము, ఎట్టి పటాటోపము లేక చరిత్రాత్మకమైన మార్పులు జరుగుచున్నవి. ఇటీవల జరిగిన ప్రధాన మార్పులలో సంస్థానమును భారత సమితిలో చేర్చుచు నిజాం జారీచేసిన ఫర్మానా ఒకటి. అటుతరువాత అంత ప్రధానమైనది సంస్థాన ప్రధాన మంత్రిగ శ్రీ వెల్లోడి నియామకము. హైదరాబాదు నవాబు శరణు జొచ్చిన అనంతరము పదమూడు మాసములు సంస్థానమును పరిపాలించిన మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌదరీ డిసెంబరు 1-వ తేదీన ఉద్యోగమును విరమించెను. ఈ పదమూడు మాసములలో మేజర్ జనరల్ చౌదరి సాధించిన మహాకార్యములు క్రమక్రమముగగాని అనుభవమునకు రావు. ఆయన హోదా మిలిటరీ గవర్నరే అయినప్పటికిని, సంస్థానమున ఎన్నడు, ఏ ప్రాంతమున సైనికపరిపాలన అమలుజరిగియుండలేదు. సంస్థానమున సెప్టెంబరు 13, 1948కి పూర్వము ప్రబలముగ నున్న రజాకర్, కమ్యూనిస్టు ముఠాలను పూర్తిగగాకపోయినను చాలవరకు నిర్మూలింప కలిగెను. సంస్థాన కాంగ్రెస్ నాయకులు ఏకమై ప్రజాశ్రేయస్సు నాకాంక్షించి వ్యవహరించిన ఎన్నడో సంస్థానమున ప్రజాప్రభుత్వ స్థాపన సాధ్యమై యుండెడిది. సర్దార్ పటేల్ మొదలు భారత ప్రభుత్వ సంస్థాన శాఖా సిబ్బంది యావత్తు సంస్థాన కాంగ్రెస్ విభేదములను పరిష్కరించి నాయకులలో ఐకమత్యమును సాధించుటకు చేసిన ప్రయత్నములన్నియు విఫలమయ్యెను.

ఇపుడు సంస్థాన ప్రధానమంత్రిగ శ్రీ యం. కె. వెల్లోడిగారు సాధింపవలసినవి అనేకము గలవు. సంస్థానమున ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగములందు జరుగవలసిన సంస్కరణ లన్నింటికి చౌదరి ప్రభుత్వము పునాదులు వేసెను. వాటిపై నవ్యహైదరాబాద్ నిర్మాణము జరుగవలసి యున్నది. మార్చిలో హైదరాబాద్ రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు జరుగనున్నవి. ఆ ఎన్నికల ఫలితములు ఎట్లుండునో వేరుగ చెప్పనవసరము లేదు. కాంగ్రెస్ అభ్యర్థులే విజయమును సాధింతురు. సంస్థానకాంగ్రెస్ లోగడ హైదరాబాద్ భాషా ప్రయుక్తముగ విభాగము కావలెనని, నవాబుగిరి రద్దు కావలెనని తీర్మానించి యుండెను. హైదరాబాదు రాజ్యాంగ పరిషత్తు ఆఖరు క్షణములో బాహ్యశక్తులు ప్రమేయము కల్గించుకొనకున్న, సంస్థాన కాంగ్రెస్ చేసిఉన్న తీర్మానమునే పునరుద్ఘాటన చేయవచ్చును. కనుక శ్రీ వెల్లోడి మంత్రివర్గము పరిషత్తు చేయబోవు నిర్ణయమును అమలు జరుపుటకు వీలుగ సంస్థాన ఆర్థిక, రాజకీయ, సాంఘిక వ్యవహారములను సరి దిద్దవలసి యుండును.

భూమి అమరకపు విధానము ఎట్లు సంస్కరింపబడవలెనో మిలిటరీ గవర్నరు ప్రభుత్వం నియమించిన ఉపసంఘం సూచిస్తూ నివేదిక తయారు చేసింది. ఆ సంస్కరణలను సాధ్యమైనంత త్వరలో అమలు జరిపిన, అరాచక శక్తులకు, ప్రజావిప్లవాన్ని ప్రోత్సహించడానికి ఉన్న ఒక్క అవకాశము తొలగిపోగలదు. ఆంధ్రరాష్ట్రంలో కొన్ని ప్రాంతముల కమ్యూనిస్టు చర్యలు ప్రబలుటకు తెలంగాణాయందలి పరిస్థితులే కారణము. కేంద్ర ప్రభుత్వము ఆంధ్రరాష్ట్ర సత్వర నిర్మాణమునకు శీఘ్రచర్యలు తీసుకొనకుండుటకు ఈ పరిస్థితులు ఎక్కువగ కారణమని భారతప్రభుత్వ హోంశాఖా కార్యదర్శి శ్రీ హెచ్. వి. ఆర్. అయ్యంగార్ చెన్నరాష్ట్ర ప్రభుత్వమునకు వ్రాసిన లేఖవలన స్పష్టమగుచున్నది. సంస్థానమునందు సంపూర్ణమైన శాంతి ఏర్పడి అరాచకశక్తుల నిర్మూలనము పూర్తియైన సంస్లిష్ట రాష్ట్రములు తమ శక్తిని, ధనమును శాంతి భద్రతల రక్షణకు గాక ప్రజాభ్యుదయ పథకములు అమలు జరుపుటకు వినియోగింప వీలగును. సంస్థానమున అట్టి పరిస్థితులను కల్పింపవలసిన బాధ్యత వెల్లోడి మంత్రివర్గముపై గలదు.

## పారిశ్రామిక "పక్షితీర్థం"

### పరిశ్రమల స్థితి: బి. వి. దాస్ విమర్శ

న్యూఢిల్లీ, డిసెంబరు 2: భారత పరిశ్రమలస్థితి తనకు పక్షితీర్థేశ్వరుని జ్ఞాపకమునకు తెచ్చుచుండెనని ఒరిస్సా మాజీ ప్రధాని శ్రీ విశ్వనాథదాసుగారు నేడు భారత శాసనసభలో చెప్పిరి. టారిఫ్‌బోర్డు సలహాయెడలను, రక్షణ విషయమునను, పారిశ్రామిక పునర్నిర్మాణము విషయమునను భారతప్రభుత్వమువా రవలంబించుచున్న విధానముయెడలను దాస్‌గారు అసంతృప్తి వెలిబుచ్చి యిట్లనిరి. 'పక్షితీర్థేశ్వరుడు ప్రతిరాత్రి బదరీనాథ్‌లో విశ్రాంతి గైకొనును. కాశీలో స్నానము చేయును. మధ్యాహ్న సమయమున పక్షితీర్థములో భోజనముచేయును. సాయంత్రం ద్వారకలో ఫలహారముచేయును. ఈ విధముగానే, మన ముడిపదార్థములు దేశములో ఒకకొనలో నున్నవి. ఫాక్టరీలు మరియొకకొనలో నున్నవి. పరిస్థితులు ఈ విధముగా నున్నంతకాలము పోటీ విపరీతముగానున్న ఈ ప్రపంచములో మన పరిశ్రమల భవిష్యత్తు గొప్పదిగానుండదు.

## 16,221 ద. ఆఫ్రికా భారతీయులు

### భారత దేశమునకు తిరిగివచ్చిరి

న్యూఢిల్లీ, డిసెంబరు 1: ద. ఆఫ్రికా నుండి వెళ్లిపోవు భారతీయులకు ఆదేశ ప్రభుత్వము చేయు సహాయము గైకొని యింతవరకు ఆదేశమునందలి భారతీయులు 16,221 భారతదేశము తిరిగివచ్చిరని విదేశాంగశాఖ సహాయమంత్రి డా॥ కేసకరుగారు నేడు పార్లమెంటులో చెప్పిరి. వీరు తిరిగివృత్తులలో ప్రవేశించుటకు భారత ప్రభుత్వమువారు సాధ్యమైన సహాయమంతయు చేసిరని ఆయన చెప్పెను.

తిరిగి వచ్చినవారు తమ వసతికి, జీవనోపాధికి స్వంత యేర్పాట్లు చేసికొనిరా? లేదా? అను విషయమై భారతప్రభుత్వము వారికి సమాచారము తెలియదని ఆయన చెప్పెను.

---

విజయవాడ, డిసెంబరు 2: విజయవాడ, విన్నకోటవారి హౌసులో డిసెంబర్ 4 తేదీ సాయంత్రం మద్రాసు ప్రభుత్వ మంత్రి శ్రీ సంజీవరెడ్డి, శ్రీ మసుపిల్లి చిట్టి శిలావిగ్రహము నావిష్కరింతురు. కార్యక్రమమునకు శ్రీ మంతెన వెంకటరాజు అధ్యక్షతవహించెదరు.

## డచ్ ప్రభుత్వ బిల్లు

(1-వ పేజీ తరువాయి)

మని డచ్చిప్రభుత్వము వ్రాసింది.

ఇండొనీషియాలో రెండవసారి జరిపిన పోలీసుచర్య విఫలంకాగలదన్న విషయం తమకు ముందుగానే విస్పష్టపడినదనీ కాని పరిస్థితుల బలాత్కారంవల్ల ఈ చర్య అనివార్యం అయిందనీ, ప్రభుత్వం చెప్పింది.

"పోలీసు చర్యను విరమింపజేయడానికి వచ్చి ప్రభుత్వం మీద అంతర్జాతీయంగా ఒత్తిడి తెచ్చారు. విదేశాలకు నెదర్లాండ్సుకు ఈ విషయమై జరిగిన రాయబారాలను బైటపెట్టడానికి ఇది తరుణంకాదు."

బిల్లుమీదను ఈ నివేదికమీదను వచ్చే మంగళవారం మధ్యాహ్నం దిగువసభలో చర్చ ప్రారంభం అవుతుంది. ప్రభుత్వ విధానంమీద ప్రతికూలపక్ష సభ్యులు తీవ్ర విమర్శ చేయగలరనుకున్నారుగాని వోటింగు అప్పుడు మాత్రం బిల్లును వ్యతిరేకించరు. బిల్లు మూడింట రెండువంతుల మెజారిటీతో ఆమోదింప బడుతుందనడానికి సందేహంలేదు. బిల్లు ఓడిపోతే, దరిమిలా దాని వల్ల ఏర్పడగల ఫలిత పర్యవసానములను ఎదుర్కోడానికి ప్రతికూల పక్షంవారు కూడా సిద్ధంగాలేరు.

### రక్షణ ఏర్పాట్లు

బటేవియా, డిసెంబరు 2: అధికార ప్రదానం జరిగేవరకు ఇండొనీషియాలో ఆంతరంగిక రక్షణ బాధ్యత యావత్తు రక్షణశాఖామంత్రి జోగ్జకర్తా సుల్తానే వహించవలెనని ప్రభుత్వం నిర్ణయించింది.

## దేశరక్షణకు రాడార్ ఏర్పాట్లు

న్యూఢిల్లీ, డిసెంబరు 2: "దేశరక్షణ యేర్పాట్లు బలపరచుటకు వీలైనవంతయు చేయుచున్నాము" అని భారతశాసనసభలో రక్షణశాఖామంత్రి సర్దార్ బలదేవ్‌సింగ్ గారు చెప్పిరి.

వివిధ విమానాశ్రయములలో స్థాపింపబడిన రాడార్ యంత్రముల విషయమై వివరములు తెలుప ఆయన నిరాకరించెను.

## ఇండియాకు అమెరికా పెట్టుబడులు

### ఒడంబడిక దోహదమిస్తుందని అమెరికా ప్రభుత్వం

న్యూఢిల్లీ, డిసెంబర్ 2; "అమెరికా ఇండియాలకు సరయిన ఒడంబడికద్వారా సంబంధాలు దృఢపడితే, అది అమెరికన్లు ఇండియాలో ఎక్కువగా పెట్టుబడి పెట్టటానికి దోహదమిస్తుందని అమెరికా ప్రభుత్వము సూచించినది" అని భారత ఆర్థిక మంత్రి డా॥ మత్తయ్ నేడు పార్లమెంటులో ఒక ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించాడు.

"మిత్రత్వ, వాణిజ్య, సాధారణ ఒడంబడిక నొకదానిని చేసుకునే విషయమై ఉభయదేశాల ప్రతినిధులు సంప్రదింపులు జరుపుతున్నారు. ఇంకా నిర్ణయం లేవీ జరగలేదు." అని ఆయన వెల్లడించాడు.

1949 ఏప్రెల్ నుంచి ఆగస్టు వరకూ ఇండియా ఎగుమతులద్వారా సాధించిన డాలర్లు 35 కోట్ల 87 లక్షలరూపాయలకు సమానమనీ, డాలర్, అధికతర గిరాకీ ద్రవ్య ప్రాంతాలనుండి ఈ సమయంలో వచ్చిన దిగుమతుల విలువ 60 కోట్ల 98 లక్షల రూపాయలనీ, అందులో యంత్ర సామగ్రి విలువ పదికోట్ల 81 లక్షల రూపాయలనీ ఆయన వెల్లడించాడు.

## జర్మనీ మనకు చెల్లించిన నష్ట పరిహారం

### సెప్టెంబరు ఆఖరువరకు 371 లక్షలు

న్యూఢిల్లీ, డిసెంబరు 1: 1949 సం॥ సెప్టెంబరు 30 తేదీవరకు జర్మనీనుండి భారతదేశమునకు 371 లక్షల రూపాయలు పరిహారముగా ముట్టెనని వాణిజ్య శాఖ మంత్రి శ్రీ నియోగిగారు భారత శాసనసభలో ఒక ప్రశ్నకు సమాధాన మిచ్చుచు చెప్పిరి. భారతదేశము జర్మనీనుండి దాదాపు 490 కోట్ల రూపాయలు, జపాను నుండి దాదాపు 2,800 కోట్ల రూపాయలు నష్టపరిహారము కోరెనని మంత్రి చెప్పెను. జపానునుండి భారత దేశమునకు నష్టపరిహారమేమియు ముట్టలేదని ఆయన చెప్పెను. మరియొక ప్రశ్నకు సమాధానమొసంగుచు 1949 సం॥ ఏప్రిల్ నుండి ఆగస్టువరకు పాకిస్థానుకు మన ఎగుమతులు 2412 లక్షల రూపాయలవిలువ చేయునవిగా నుండెనని, పాకిస్థానునుండి మనదేశమునకు వచ్చిన దిగుమతులు 2471 లక్షల విలువ చేయునవిగా నుండెనని ఆయన చెప్పెను.

స్టర్లింగ్ మారకపు రేటు తగ్గిన నాటి నుండి ఇండియా-పాకిస్థాను వర్తకము యించుమించి స్తంభించి యున్నదని ఆయన చెప్పెను. భారతదేశములో నిప్పుపెట్టెల ఉత్పత్తి 1948 సం॥ములో 50 గ్రోసులతోకూడిన పెట్టెలు 5,33,243 అని, ఈ సంవత్సరము మొదటి 9 నెలలలో 3,94,279 పెట్టెలని ఆయన చెప్పెను. భారతదేశములో వార్షిక వినియోగము 5 లక్షల పెట్టెలనిరి. (పెట్టెలో 50 గ్రోసు లుండును).

# ముడిపత్తిపై భారత ప్రభుత్వ కంట్రోలు

## డా॥ శ్యామప్రసాద ముఖర్జీ సవరణ బిల్లుకు పార్లమెంటు ఆమోదం

న్యూఢిల్లీ, డిసెంబరు 2: ముడిపత్తి, పత్తివిత్తులపై కేంద్ర ప్రభుత్వం కంట్రోలుండడంకొరకు అవసర సప్లయిల (తాత్కాలికాధికారాల) చట్టాన్ని సవరిస్తూ పరిశ్రమల, సప్లయిలమంత్రి డా. శ్యామప్రసాద ముఖర్జీ తెచ్చిన బిల్లును నేడు అధివేశ శాసనసభ వారామోదించారు. ఈ నిమిత్తమై జారీచేయబడిన ఆర్డినెన్సు స్థానే ఈ చట్టం అమలు జరుగుతుంది.

డా. ముఖర్జీ మాట్లాడుతూ, ప్రస్తుతానికి గింజలు తీయని పత్తి (కాపస్) పై కంట్రోలుంచబడదనీ, ప్రధానంగా పత్తిపండే అయిదు ప్రాంతాలలో ఒక ప్రాంతంనుండి మరొకప్రాంతానికి గింజలుతీసిన పత్తి పోకుండా చూడబడుతుందనీ, అట్లా పత్తి ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి పంపాలంటే టెక్స్‌టయిలు కమిషనరువద్ద పర్మిటు పొందాలనీ, గడచిన కొద్దిమాసాలలో ఇండియా బట్టల వర్తకం ఇతర దేశాలతో తిరిగి బాగా సాగిందనీ అన్నారు.

రబ్బరు (ఉత్పత్తి విక్రయ) సవరణ చట్టానికి డా. శ్యామప్రసాద ముఖర్జీ తెచ్చిన సవరణబిల్లు కూడా ఆమోదించబడింది.

డా. శ్యామప్రసాద్‌ముఖర్జీ అవసర సప్లయిల (తాత్కాలికాధికారాల) రెండవ సవరణబిల్లు ప్రతిపాదించారు. న్యాయశాఖ గారి సలహాపై ముడిపత్తి, రాగి బొగ్గూ, ఇతర బొగ్గుదినుసులూ ఈ చట్టం కింద చేర్చబడినవి.

మహా వీరత్యాగి ప్రశ్నకు సమాధానంగా డా. ముఖర్జీ, గింజలుతీయని పత్తి కూడా కంట్రోలుచేసే వస్తువులలో చేర్చబడినప్పటికీ ప్రస్తుతంలో అది కంట్రోలు చేయబడదనీ, ఇకముందు దానికి కంట్రోలు జరగడమనేది పరిస్థితులపై ఆధారపడుతుందనీ అన్నారు.

డా. పంజాబరావు దేశముఖ్ బిల్లును బలపరుస్తూ, లోగడ కంట్రోలు జరిగినప్పుడల్లా ధరలుహెచ్చి మధ్యవర్తులకు బాగు పడ్డారనీ, ఈసారి కంట్రోలు ఏర్పరచడంలో వ్యవసాయదారునిగాని ఉత్పత్తిదారునిగాని "హోవిడిగాళ్ల" వాతపడకుండా చూడాలనీ అన్నారు.

నిర్ణయించబడే ధరలు పత్తి ఉత్పత్తిదారుకు గిట్టుబాటుగా ఉండాలనీ, మధ్యవాళ్లు బాధపడరాదనీ చౌదరీ రణబీర్‌సింగ్ అన్నారు.

చర్చకు సమాధానమిస్తూ డా. ముఖర్జీ ఈ విషయాలు చెప్పారు:

డా. దేశముఖ్ సూచించిన కారణంచేతనే గింజలుతీయని పత్తి ధర నిర్ణయించబడలేదు. పత్తి పండించేవారు పారిశ్రామికులనుంచి హెచ్చు ధరలు ఆశిస్తారు. ఉభయపక్షాలకు సమన్వయించడం సాధ్యం కాదు. ప్రభుత్వంవారు అన్నిపక్షాలకూ న్యాయంగా ఉండేమార్గం ఆలోచిస్తున్నారు.

ఈయేడు దేశంలో 28 లక్షలబేళ్ల పత్తి ఉత్పత్తిఅయింది. ఇందులో 2 లక్షలు ఎగుమతికీ, ఇతర అవసరాలకూ ప్రత్యేకించబడింది. మిల్లుల కనీస అవసరాలకు ఇండియా పాకిస్థానుల పత్తి 34 లక్షల బేళ్ళు, విదేశీ పత్తి 6 లక్షల బేళ్ళూ కావాలి. పాకిస్థానునుంచి విశేషంగా పత్తి రాదు. కనుక పత్తి కంట్రోలు తప్పనిసరి అయింది. ప్రధానంగా పత్తి పండించే ప్రాంతాలు నాలుగైదుగా విభజించబడినవి. టెక్స్‌టయిలు కమిషనరు ఇచ్చే పర్మిటుతోతప్ప పత్తి ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి పంపరాదు. మిల్లుల అవసరాలనుబట్టి మాత్రమే పర్మిట్లు ఇవ్వబడతవి. కాని పత్తి ఉత్పత్తి హెచ్చితేతే గాని ఈసమస్య శాశ్వతంగా పరిష్కారం కాదు. వ్యవసాయ ఆర్థికవ్యవస్థ సమతూకంగా ఉండి ఆహారధాన్యాల ఉత్పత్తితోబాటు జనుము, పత్తికూడా అధికంగా ఉత్పత్తికావాలి.

అనంతరం బిల్లుపై క్లాజులవారీ చర్చ జరిగింది.

ఈబిల్లు బొగ్గుకుమాత్రమే వర్తించాలని సవరణ ప్రతిపాదిస్తూ డా॥ మన్‌మోహన్ దాసు, బొగ్గుదినుసులన్నట్టయితే, రంగులూ, నీలిమందూ, మరికొన్ని మందులూ కూడా కంట్రోలు కిందికి రాగలవన్నారు. డా॥ ముఖర్జీ సమాధానం చెబుతూ, అది ప్రభుత్వోద్దేశం కాదనీ, అవసరమైతే తప్ప ఇటువంటి దినుసులు కంట్రోలు జరపమనీ, న్యాయ నిర్ణయాలు సులువుగా ఉండడం కొరకు బొగ్గు దినుసులనే మాట చేర్చబడిందనీ అన్నారు.

అనంతశయనం అయ్యంగారు మాట్లాడుతూ, చెరుకుధరల వలెనే ముడిపత్తి ధర లుకూడా నిర్ణయించాలనీ, పారిశ్రామిక వ్యవసాయశాఖలకూ, పరిశోధనశాఖకూ, వ్యవసాయదారులకూ మధ్య సామరస్యం ఉండవలసి ఉన్నదన్నారు.

పండిట్ ఠాకూర్దాసు భార్గవ మాట్లాడుతూ, భాక్రాప్రాజెక్టు నిర్మించి నీరు సప్లయి చేసే తూర్పు పంజాబులో కొన్ని ప్రాంతాల పొడుగు పింజ పత్తి పండి, దాని కొరకు ఇతర దేశాలమీద ఆధారపడవలసిన అగత్యంగాని, కంట్రోళ్లుగాని అవసరం లేకుండా పోతుందనీ, పొడుపు కొరకు ప్రభుత్వంవారు ఈ ప్రాజెక్టుకుగాను ఇచ్చే డబ్బును 21 కోట్లనుంచి 6 కోట్లకు తగ్గించి నిర్మాణం జాగుచేస్తున్నారనీ, ఉపశమనమార్గాలు చూడడం కంటే సమస్యను సమూలంగా పరిష్కరించి ఉత్పత్తి హెచ్చించడం మేలనీ అన్నారు.

ప్రొ॥ రంగా మాట్లాడుతూ, తయారీ వస్తువులధరలలాగే ముడిపత్తి ధరకూడా నిర్ణయించబడాలనీ, ప్రస్తుతం ముడిపదార్థాలధరలు అడ్డగోలుగా నిర్ణయించబడుతున్నవనీ, ఉత్పత్తిఖర్చులు పాటించబడడంలేదనీ, ధరలుపెంచడమో ఉత్పత్తి రెండుమూడింతలుగా పెరిగే మంచిరకపు విత్తనాలు సప్లయిచేయడమో జరిగితేతప్ప ఉత్పత్తిహెచ్చదనీ, ప్రభుత్వం ప్రాజెక్టులను నిలుపుచేయరాదనీ వాటికవసరమైన ధనం దేశంలోనే లభిస్తుందనీ అన్నారు.

ఒకప్పుడు ఒరిస్సాలో పండినపత్తి ఇప్పుడు పండడంలేదనీ, అనేకప్రాంతాలలో పత్తిపండించేటందుకు ప్రయత్నాలు జరగాలనీ లక్ష్మీనారాయణ సాహు అన్నారు.

నాజీరుద్దీన్ అహమ్మదు మాట్లాడుతూ ప్రభుత్వం కంట్రోలు ఏర్పాటుచేసినప్పుడల్లా సరుకుమాయమై దొంగవ్యాపారం సాగుతుందనీ, ఒక పదార్థం ఉత్పత్తిహెచ్చిస్తే మరొక పదార్థం ఉత్పత్తి దెబ్బతింటుందనీ అన్నారు.

రామలింగం చెట్టియారు ఈ విధంగా చెప్పారు. పొట్టి పింజపత్తి పండేపొలాలు హెచ్చించిలాభంలేదు. పొడుగు పింజపత్తి పండించటానికి 40 ఏళ్ళుగా జరిగే ప్రయత్నాలు ఫలించలేదు. తూ. పంజాబులో పెరిగే పొడుగు పింజపత్తితో 80 పైచిల్లర నంబర్ల నూలు తయారు కాదు. ప్రభుత్వం నిర్ణయించే ధరలు రైతులకు గిట్టుబాటు కావడం లేదన్నది నిజంకాదు. సరి అయిన నీటివసతిగల పత్తి పొలాలమీద ఎకరానికి 800, 1000,రూపాయలు గిట్టుతున్నవి. కాని కంట్రోళ్లు మాత్రం అమలు చేయరాదు. ముడిపత్తి పత్తివిత్తుల ధరలుకంట్రోలు చేయడం క్లిష్టమైన పని. ప్రభుత్వం జాగ్రత్త వహించాలి.

డా॥ శ్యామప్రసాద ముఖర్జీ మాట్లాడుతూ ఈ విధంగా అన్నారు:

వివిధ సభ్యులు చెప్పిన విషయాలను బట్టి సమస్య ఎంత క్లిష్టమైనదో తెలుస్తున్నది. అందుచేతనే ప్రస్తుతం ప్రభుత్వం గింజలు తీయని పత్తినీ, పత్తిగింజలనూ కంట్రోలు చేయదలచలేదు. సర్వంగా జరుగుతుందని తోచినప్పుడే కంట్రోలు జరుగుతుంది. ఇండియాలోని మిల్లులకు అదనంగా కావలసిన 10, 15 లక్షల బేళ్ళ ప్రత్తి దేశంలో ఉత్పత్తి ఆయేవరకూ కంట్రోళ్లు తప్పవు. వాయిదా బేరాల పద్ధతిని ఆమోదించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. దీనికి సంబంధించిన నిబంధనలను ప్రభుత్వానుమతితో ఈస్టిండియా కాటన్ అసోసియేషనువారు తయారు చేస్తారు. అవి అమలులోకి వచ్చే తేదీ టెక్స్‌టయిలు కమిషనరు ప్రకటిస్తారు. వాయిదా బేరాలమీద జూదం సాగకుండావుల్ల కింద మేడు చాలా ఆపద సంభవించింది. అందుచేత ఈ జూదాలను నివారించడానికి ప్రభుత్వం యత్నిస్తుంది.

దేశ విభజనవల్ల తారుమారైన పత్తి పరిస్థితి చక్కదిద్దడానికిగాను, అంటే పాకిస్థానులో ఉత్పత్తి అయే పత్తి ఇక్కడ ఉత్పత్తి జరిగేటట్లు చూడడానికిగాను ఇటీవల కేంద్రపత్తి సంఘంవారున్నూ, వ్యవసాయ శాఖవారున్నూ రెండు సమావేశాలు జరిపారు. సౌకర్యాలుంటే తూ. పంజాబులో పొడుగుపింజ పత్తి తయారవుతుంది. భాక్రా ప్రాజెక్టును జబ్బుగ్రాంటు చేసేపని ఆర్థిక శాఖవారిది.

అవసర వస్తువులు, ముఖ్యంగా పత్తి ఉత్పత్తి హెచ్చించడానికి ప్రభుత్వం చేసే ప్రయత్నాలు 2, 3 ఏళ్లలో ఫలించడానికి అవకాశం ఉన్నది. ధరలు నిర్ణయించడంలో ప్రభుత్వం రైతులను గురించీ పారిశ్రామికులను గురించీ కూడా ఆలోచిస్తున్నది. రైతులకు న్యాయం జరగాలనే ఉద్దేశం ప్రభుత్వాని కున్నది. కాని ధరలు నిర్ణయించనిపక్షంలో ధరలను బట్టి వివిధ పదార్థాల ఉత్పత్తి సాగుతుంది. ధాన్యంధరలతో పోల్చితే అన్యాయంగా ఉండకుండా పత్తిధర నిర్ణయించబడింది. అవసర వస్తువులధరలు తగ్గాలని ఈ సభవారే అంటున్నారు. వారే ఆహారమూ, పత్తీ మొదలైన అవసరవస్తువుల ధరలు హెచ్చుగా ఉండాలని కోరడం భావ్యం కాదు. నిర్ణయించబడే ధరలు తక్కువగా ఉంటూనే, అధికోత్పత్తికి తోడ్పడాలి. ఈ అవసరవస్తువు సమృద్ధిగా ఉత్పత్తి ఆయేవరకూ ప్రభుత్వం కంట్రోలు జరపక తప్పదు.

చౌధరీ రణబీరసింగు మాట్లాడుతూ, ప్రభుత్వంవారు భాక్రా ప్రాజెక్టును త్వరగా నిర్మిస్తే అన్ని సమస్యలూ తీరుతవనీ, అధికోత్పత్తి చేసేది రైతుగాని కంట్రోళ్లు కావనీ అన్నారు.

ప్రొ॥ శిబన్‌లాల్ సక్సేనా, ప్రభుత్వం వారు తను కంట్రోళ్లద్వారా భూమి యొక్క ఉత్పత్తిశక్తి పెంచాలనీ, సెరకు కూడా ఈ బిల్లులో చేర్చబడితే బాగుండేదనీ అన్నారు.

బిల్లు రచనలో తప్పులున్నవనీ, మంత్రులు తప్పులు సవరించుకోవడానికి బిడియపడతారనీ, చాటుగా లోపాలు చూపినప్పుడుమాత్రం సర్దుకొంటారనీ నాజిరుద్దీన్ అహమ్మదు ఆక్షేపించారు.

ఎడారిగావున్న సింధురాష్ట్రం సుక్కూరు బరాజితో అధికాహారక్షేత్రమయింది కనుక ప్రభుత్వంవారు తప్పను పొదుపు విధానం అవలంబించక వెంటనే భాక్రాప్రాజెక్టు నిర్మించాలని ఆర్. కే. సిధ్వా అన్నారు.

ముడిపత్తిపై కంట్రోలు ఏర్పరచినందుకు విశ్వనాథదాసు డా॥ ముఖర్జీని అభినందిస్తూ, బట్టల విషయంలో జరిగినట్లే ఈ విషయంలోకూడా డా॥ ముఖర్జీ కంట్రోళ్లు అమలుజరుపలేకపోతే ఆయనతోబాటు దేశంకూడా "మునుగుతుంది" అన్నారు. ఈ కంట్రోళ్ల ఫలితంగా బట్టల ధరలు తగ్గాలి. పత్తివిత్తులు ఎగుమతి మాని గొడ్లమేతగా ఉపయోగించాలి. ఆహారం ధరలూ, బట్టల ధరలూ, ప్రజావసరాల ధరలూ తగ్గకపోతే రాజ్యాంగానికి చిత్తుకాగితం విలువ ఉండదని ఆయన చెప్పారు.

### డా॥ ముఖర్జీ సమాధానం

చర్చకు సమాధానం చెబుతూ డా॥ ముఖర్జీ, వ్యవసాయోత్పత్తి ఖర్చులు సరిగా నిర్ణయించడానికి వీలయిన లెక్కలు లభ్యమయేదాకా ప్రభుత్వంవారు వ్యవసాయ సరుకుల న్యాయమైన ధరలు నిర్ణయించడం కష్టమన్నారు. అందరి అభిప్రాయాలూ తెలుసుకొనేవరకూ ప్రభుత్వం గింజలుతీయని పత్తి (కాటన్) ధర కంట్రోలుచేయదని కూడా ఆయన మాట ఇచ్చారు.

బట్టలధరల కంట్రోలు విధానం విజయవంతమైందని ఆయనచూపారు. కంట్రోలు లేని కాలంలో రూపాయికి అర్ధరూపాయి లగాయతు రూపాయన్నరవరకూ పెరిగిన బట్టలధర లిప్పుడు చాలా తగ్గినవి. అనేక ప్రాంతాల స్టాంపువేసిన ధరకంటె తక్కువ ధరలకు బట్టదొరుకుతున్నది. కాని పత్తి ఉత్పత్తి హెచ్చితేగాని బట్టలధరలు పూర్తిగాదిగవు.

లోగడ బట్టల ఎగుమతులు స్వీకరించడం మానిన దేశాలు తిరిగి ఇప్పుడు ఇండియానుంచి బట్టలదిగుమతు లారంభించినవి. మనం ఏటా తయారుచేసే 400 కోట్ల గజాలబట్టలో ఈయేడు 80 కోట్ల గజాలు విదేశాలకు ఎగుమతి కావచ్చు. దీనివల్ల మనకు విదేశీ ద్రవ్యంకూడా లభిస్తుంది.

## రబ్బరు (ఉత్పత్తి విక్రయ) సవరణ బిల్లు

రబ్బరు ఉత్పత్తిదార్లు, కావాలంటే, ప్రభుత్వ జోక్యంలేకుండా, రబ్బరు నేరుగా అమ్మేటందుకు వీలుకల్పించే రబ్బరు (ఉత్పత్తి, విక్రయ) సవరణబిల్లును డా. ముఖర్జీ ప్రతిపాదించారు.

ఈ బిల్లును సెలెక్టుకమిటీకి చూపాలని సవరణ సూచించిన శిబన్‌లాల్ సక్సేనా, చిన్న ఉత్పత్తిదార్లకు నష్టం కలగకుండా ప్రభుత్వం చూస్తుందని డా॥ ముఖర్జీ హామీయివ్వగా, తనసూచన ఉపసంహరించుకున్నారు.

రబ్బరుకు జాతీయజీవితంలో ప్రాముఖ్యం హెచ్చుతున్నదని ఈబిల్లు చాలా మంచిదనీ కామత్ అన్నారు.

పి. టి. చాకో మాట్లాడుతూ ఈబిల్లు అనవసరమనీ, కాగా దీనిమూలంగా రబ్బరు బోర్డులో చేరిన పెద్దఉత్పత్తిదార్లు మరింతలాభాలు తీస్తారనీ అన్నారు.

చిన్న ఉత్పత్తిదారులకూడా స్వేచ్ఛగా లైసెన్సులలభిస్తవనీ, వారికినష్టంజరగదనీ డా॥ ముఖర్జీ అభయంఇచ్చారు. చిన్న ఉత్పత్తిదార్లకు రబ్బరుబోర్డులో ప్రాతినిధ్యం ఇవ్వాలని తన అభిప్రాయంగా కూడా ఆయన చెప్పారు.

డా॥ ముఖర్జీ రబ్బరు గురించి ఈ కింది వివరాలిచ్చారు.

ఏటా ఇండియాలో 16 వేలటన్నుల రబ్బరు ఉత్పత్తిఅవుతున్నది. ఇండియాకు కావలసినది 21 వేల టన్నులు. లోటు స్ట్రెయిట్సుప్రాంతంనుంచి దిగుమతి అవుతున్నది. అయితే ఇండియారబ్బరు ధర ప్రపంచధరకంటె నూటికి 40 వంతులు హెచ్చుకావడంచేత ఇండియాలో తయారయే రబ్బరుసామగ్రి ఎగుమతికావడం దాదాపు అసాధ్యంగా ఉన్నది. కనుక ఇండియారబ్బరు ఉత్పత్తిపెంచి, ధర తగ్గించాలి. రబ్బరువస్తువులను ఇండియా తనకు తగినంతగా తయారుచేసుకొంటున్నది. అయినా రబ్బరుపరిశ్రమయొక్క అభివృద్ధి ధరలుతగ్గడంపై ఆధారపడివున్నది.

ఈ బిల్లుపై ఇంకేమీ చర్చజరగలేదు. బిల్లు ఆమోదించబడింది.

## స్వీకృతభూమి పరిహారం బిల్లు

స్వాధీన పరచుకోబడిన భూముల పరిహారం నిర్ణయించే బిల్లును సర్దారు బలదేవసింగు ప్రతిపాదించారు. ఇండియా రక్షణ చట్టంకింద నియమింపబడిన పరిష్కర్తకు భూమిదారులమధ్య పరిహారం పంపకంచేసే అధికారం లేదని ఇటీవల కలకత్తా హైకోర్టు తీర్పు ఇచ్చిఉండడంచేత ఈ బిల్లు తయారు చేయబడింది. భూమి పరిహారం పుచ్చుకోవడంలో వివిధ భాగస్వాములు రాజీపడని కేసులన్నీ నిలచిపోయినవి. ఈ కేసులను పరిష్కారం చేయడానికి ఆర్డినెన్సు జారీ అయింది. దాని స్థానే ఈ బిల్లు వస్తున్నది.

మహా వీరత్యాగి బిల్లును ఆమోదిస్తూ, సైనికశాఖవారు భూమి స్వాధీనపరచుకోవడంలో అత్యాచారాలు చేశారని రుజువుచేస్తూ రెండు ఉదాహరణ లిచ్చారు. డెహ్రాడూన్‌లోని ప్రేమనగరులోని ఇంటి యజమాని పనికి వెళ్లిఉండగా సైనికశాఖవారు ఆతని కుటుంబాన్ని వీధిలోకి గెంటి అతని గుడిసె ఆక్రమించుకున్నారు. ఇదేవిధంగా మేలురకం. బియ్యం పండే నూరెకరాల సుక్షేత్రాన్ని సైనికశాఖవారు స్వాధీనం చేసుకొని, దానిని వారు ఉపయోగించుకోలేదు. భూస్వామికి పరిహారం ఇవ్వలేదు. భూమినైనా తిరిగి ఇవ్వలేదు. ఇట్టి దారుణాలు జరగవని రక్షణ శాఖామంత్రి హామీ ఇవ్వాలి. ఆయన మొదట దేశంలోని పేద ప్రజలను రక్షించాలి. పేదప్రజలను రక్షించలేనివాడు దేశ సరిహద్దులను రక్షించగలడా? దేశ రక్షణార్థం రక్షణశాఖవారు భూమి స్వాధీన పరచుకోవచ్చు. కాని పేదప్రజలకు నష్టం కలిగించి మాత్రం కాదు.

చర్చ ముగియకుండానే సమావేశం ముగిసింది.

## కాశ్మీర్ కమిషన్: సభ్యుల్లో అభిప్రాయ బేధాలు

1 వ పేజీ తరువాయి

కాశ్మీరసంఘం నివేదిక భద్రతా సంఘానికి త్వరలోనే అందబోతున్నది. అందుచేత ఐక్యరాజ్యసమితి లాబీవర్గాలు ముందు జరిగే వ్యవహారంలో అనేక విధాలుగా చర్చించుకుంటున్నారని పి. టి. ఐ. విలేఖరి వ్రాస్తున్నాడు.

ఒక సంఘాన్ని నియమించింది కనుక ఐక్యరాజ్య సమితి కార్యాలయం ఈ కాశ్మీర సంఘాన్ని రద్దు పరచదనీ, ఏదైనా సంతృప్తికరమైన రాజీ జరిగితే ఈ సంఘాన్ని రద్దుపరచడం జరగవచ్చుననీ అనుకుంటున్నారు. అయితే కాశ్మీర సంఘ సభ్యులలోనే అభిప్రాయభేదాలు బయలుదేరాయి కనక, ఈ సంఘ సభ్యులంతా కలిసి ఒక మధ్యవర్తిని నియమించవలసిందని సూచించవచ్చుననీ, దీనివల్ల కొన్ని ఇబ్బందులు తొలగిపోగలవనీ అనుకుంటున్నారు.

అయితే అట్లాంటి మధ్యవర్తిని నియమించడం జరిగినప్పుడు ఐక్యరాజ్య సమితిలో పెద్దల నెవరినైనా ఈ పనికి నియోగించవచ్చునని తెలుస్తున్నది.

కాశ్మీర సంఘ నివేదిక డిసెంబరు 10 లోగా లేక్‌సక్సెస్‌కు చేరవచ్చునట. ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశం పూర్తి కాగానే భద్రతాసంఘ సమావేశం జరుగుతుంది. భద్రతాసంఘం సమావేశమైన తరవాత ముందుగా ఇండోనీషియా సమస్య చర్చిస్తుంది. భద్రతా సంఘం ఇండొనీషియా సమస్యను ఎంత త్వరగా తెమిల్చినా ఇది క్రిస్మసు పండుగలదాకా నడవడం తప్పదు.

అందుచేత కాశ్మీర్‌సమస్య కొత్త సంవత్సరంలోగాని చర్చింపబడకపోవచ్చును

## భారత వైమానిక దళాధిపతి

### ఆవడి విమాన కేంద్ర దర్శనం

చెన్నపట్నం, డిశంబరు 2: భారతదేశం ఆర్. ఐ. ఏ. యఫ్. కేంద్రముల తనిఖీ చేస్తూ పర్యటనను చేస్తున్న భారత వైమానిక దళాధిపతి ఎయిర్ మార్షల్ ఎల్మ్‌హార్స్టు గారు యీ దినం ఉదయం ఆవడిలో గల ఆర్. ఐ. ఏ. యఫ్ సప్లయి కేంద్రమును వీక్షించి తనిఖీ చేసిరి. వారి వెంట లేడీ ఎల్మ్‌హార్స్టు, దక్షిణ ప్రాంతం వింగ్ కమ్మాండర్ ఆర్. ఏ. సింగ్ ఆయన సతీగారు కూడా యుండిరి. సర్వదళాధిపతి కేంద్రమునకు రాగానే అచ్చటి అధికారులు వారికి స్వాగత మొసంగిరి. ఆ పైని వారు వైమానికదళము పెరేడును వీక్షించి సైనిక వందనము గైకొనిరి. వైమానికులు ఆయన సముఖమున వరుసగా కదనం త్రొక్కుచూ వెళ్లి జోహారు లొసగిరి. ఎయిర్ మార్షల్ ఎల్మ్‌హార్స్టు గారు దరువాత ఉద్యోగులతో కొంత ముచ్చటించి కేంద్రము నందలి పలు శాఖలను తనిఖీ చేసిరి. పిల్లల వ్యాయామ క్రీడలు వీక్షించి బహుమతులు పంచిరి.

ఆవడిలో గల నెం 2 సామగ్రి సప్లయి డిపో బొంబాయిలో నెం 2 డిపోయొక్క యుద్ధానంతరము బట్టి నిర్మితమైనది. వైమానిక సామగ్రి సప్లయికి యీ రెండు డిపోలు మాత్రమే భారతదేశమున కలవు.

ఈ డిపో వారు భారతీయులు మొదలగు ఆహార వస్తువులను కూడా పంపించుచూ అధికారుల తృప్తికి తోడ్పడుచున్నారు. భారతదేశమున దహవారి విమాన సర్వీసు ప్రారంభించిన వారిలో మొట్టమొదటి వారైన వింగ్ కమ్మాండర్ దాస్గా గారు ప్రస్తుతం యీ కేంద్రానికి అధిపతిగా నున్నారు.

భారతవైమానికదళాధిపతి ఎయిర్ మార్షల్ ఎల్మ్‌హార్స్టు ఆవడిలో ఆర్. ఐ. ఏ. యఫ్. కేంద్రమున జరిగిన పెరేడుకు వెళ్ళుచున్నారు.

## "నాయుడుగారి వాయులీనం విని మరోలోకానికి తేలిపోయాను"

### ద్వారం వెంకటస్వామి నాయుడుగారికి డా॥ రాజేంద్రప్రసాద్ జోహర్లు

న్యూఢిల్లీ, డిసెంబరు 2: దక్షిణ భారత వాయులీన విద్వాంసులైన ప్రొఫెసర్ ద్వారం వెంకటస్వామి నాయుడుగారి ప్రతిభకు నతివారం పండిట్ నెహ్రూ, డాక్టర్ రాజేంద్రప్రసాదుగార్లు జోహారు లర్పించారు. నాయుడుగారి గాన రసాస్వాదనానికి ఆటంకంగా తమ కింత పను లున్నందుకు వారెంతో చింతించారు. ఈ వాయులీన గానం విని తాను వాయు పథాలలో మరోలోకానికి తేలిపోయాను అని డా॥ ప్రసాద్ అన్నారు.

ఆదివారంనాడు, మంగళవారంనాడు నాయుడుగారు ఢిల్లీలో నేవివక చ్చేసిన కళ్ల, వాయులీనంయొక్క ... ఏకశాస్త్రం కేకాకుండా, రాతికారీరక శాస్త్రం కూడా ఆయనకు కరతలామలకమని వ్యక్తి అయింది. నాయుడుగారి చేతుల్లో వాయులీనమునకు మానవకంఠాలు అబ్బినట్లు తోస్తుంది. ఒకసారి హాస్యచాతుర్యం కనపరుస్తుంది. ఒకసారి దుఃఖాన్ని, మరొకసారి ఆనందాన్ని వ్యక్తపరుస్తుంది. ఇంకొకసారి దానివ్యక్తిత్వమంతా ఒక సన్నని ఆలాపనలో వ్యక్తమౌతుంది. వాల్ట్ డిస్నీ తనవర్ణచిత్రాలలో ఎంత గొప్పదనం ప్రదర్శించగలడో, నాయుడు గారు తనవాయులీనగానంలో అంత ప్రతిభను ప్రదర్శించగలరు. ఆయన దాక్షిణాత్యరాగాలను సర్వశిపోలకల్పితమునైన మార్గాలలో ఆలాపిస్తున్నప్పుడు, సంప్రదాయసిద్ధమైన మార్గాలను ఆయన తృణీకరించి అతిక్రమించిపోతున్నట్లు, నవీన శాస్త్రకారులతో సవాల్ చేస్తున్నట్లు తోస్తుంది. కర్నాటక సంగీతంలో ఒక క్రొత్తరకపు సార్వజనీనతను తీసుకురావటానికి ఆయన యత్నిస్తున్నారా అని పిస్తుంది. కర్నాటక సంగీతాన్ని దాక్షిణాత్యులు పలికించే దృక్పథంలోనే ఒక గొప్ప మానసిక పరిణామాన్ని ఆయన తీసుకువచ్చారు. దాక్షిణాత్య శాస్త్రీయ సంగీతంలో మహాలింగంగారి వేణువు యిదే విధమైన నవీనతను ప్రకాశపెట్టింది.

గత ఆదివారంనాడు నాయుడుగారు తన కార్యక్రమంలో వివిధ శాస్త్రీయ బంధాలను అద్భుతంగా ప్రదర్శించారు. ఈ కార్యక్రమం ముఖ్యంగా దాక్షిణాత్యులకే ఉద్దేశింప బడినప్పటికీ, వచ్చిన శ్రోతలంతా 4 గంటలసేపు రసముద్రంలో ఓలలాడారు. బెంగాలీ శ్రోత ఒకరు కోరినందున, నాయుడుగారు 'దర్బార్ కన్నడ' రాగం వాయించారు. ఇందులో రాగం తానం పాకడలు నిరుపమానంగా ఉన్నాయి. "రఘువంశ సుధాంబుధి" అనేపాటను కూడా ఆయన వాయించారు. దీనిరాగం కదన కుతూహలం. సాధారణంగా దక్షిణ భారతంలో ప్రతిసరయావని పెళ్లి చూపులకు ముందు ఈ పాటను అభ్యసిస్తుంది. కాని నాయుడుగారు ఈ పాటను వాయులీనంలోనికి పదించిన పద్ధతి చూస్తే, పూర్వసంప్రదాయానికి నూత్నత్వము నాపాదించటమంటే నాయుడుగారి ఉద్దేశ్య మేమిటో స్పష్టంగా బోధపడింది.

అయితే నాయుడుగారు రెండు కచ్చేరీలలోను కల్యాణివంటి పెద్ద రాగాలను ఎత్తుకోలేదు. హిందోళ, మలయమారుతం వంటి పెద్ద రాగాలను వాయిస్తే ఉత్తరాదిక శ్రోతలకవి అంత రుచించవేమోనని ఆయన భావించి వుండవచ్చు. కాని ఆయన అలా భావించవనవసరం లేదు. ఎంత క్లిష్టమైన రాగాలనైనా ఆయన వినిపించి వుండవలసింది. ఒకవేళ ఉత్తరాదులు అట్టి సంగీతాన్ని విని కంగారు పడినప్పటికీ, కచ్చేరి అంత్యంలో ఆయన మామూలుగా వినిపించే చెక్కిలి టుమ్రీలువారి అలసటను పోగొట్టగలిగేవి.

## ఆంధ్రరాష్ట్రంతర్వాతనే ఇతర భాషారాష్ట్రాలు

(1-వ పేజీ తరువాయి)

స్థాపనమస్తూ, అలాంటి దేమీ అవసరంలేదని అసలు బొంబాయి తిరువాన్కూరులను మద్రాసులో కలపాలనే ప్రసక్తే లేదని, సర్దార్ పటేల్ సమాధానమిచ్చారు.

కేరళరాష్ట్ర నిర్మాణవిషయం రాజప్రముఖు గురించి మాట్లాడుతూ, రాజప్రముఖు ఉనికి రాష్ట్ర నిర్మాణానికి అభ్యంతరం కాబోదని పటేల్ చెప్పారు.

### సంస్థానసమాఖ్య శాసన సభలో తీర్మానం

త్రివేండ్రం, డిశంబరు 1: తిరువాన్కూర్-కొచిన్ సంస్థాన సమాఖ్యను మద్రాసు రాష్ట్రంలో కలిపే విషయం నిర్ణయించటానికి అవకాశ మివ్వాలని ఒక తీర్మానాన్ని సి. వి. అయ్యర్ ఈ వేళ సంస్థాన సమాఖ్య శాసనసభలో ప్రతిపాదించుకూ ఇలా తెలియజేశారు.

'సంయుక్త కేరళం యేర్పడే సావకాశం లేదు గనుక ఈ సంస్థాన సమాఖ్యను మద్రాసు రాష్ట్రంలో కలపాలని ఒక అభిప్రాయం వున్నట్లు తెలుస్తున్నది. ఇలాంటి నిర్ణయం చేయటం ప్రజామహాసభ నిర్ణయానికి వ్యతిరేకం కావటమే గాక పరిపాలనాశాఖ అధికారాధిపులకు మించిన విషయం. ఈ విషయమై చర్చించుటకు శాసన సభలో అవకాశమివ్వాలి అన్నారు. శాసన సభాధ్యక్షులు ఈ తీర్మానాన్ని త్రోసివేశారు.

### ధాన్య సేకరణకు లెవీ విధానము

మదరాసు, డిశంబరు 1: ఆహార ధాన్యములను మిగులును సేకరించుటకు ప్రస్తుతపు విధానమునకు బదులు "లెవీ" పద్ధతిని అమలు జరుపువిషయము ప్రభుత్వమువారి ఆలోచనలో వున్నది. ఈ సందర్భమున ఈ విధానమును సూచించిన కోయంబత్తూరు కలెక్టరునుండి సమగ్రమైన నివేదికను ప్రభుత్వము ఎదురు చూచుచున్నారు.

ఆహారమంత్రి శ్రీ వి. విక్టోరియా విలేఖరులతో మాట్లాడుచు తుపానువల్ల పరిస్థితి సరిగా లేదనియు, లెవీ విధానమును అమలు జరుపు అవకాశము కనపడుట లేదనిరి. తుపానుదెబ్బ తిన్న ప్రాంతములలో సేకరణ ఆపు చేయలేదనికూడ అనిరి.

### నగరంలో సినిమాలు

| | |
|---|---|
| సాగర్ | 'గరల్స్ స్కూల్' |
| బ్రాడ్వే | 'షినాయ్' |
| గెయిటీ | 'ఇన్సానియత్' |
| వెల్లింగ్టన్, ప్రభాత్ | 'అపూర్వ సహోదరగళ్' |
| సెలెక్టు | 'బడీబహెన్' |
| స్టార్ | 'వారియర్ ఆఫ్ రష్యా' |
| చిత్ర | 'ఖద్దర్ కా ఫూల్' |
| పన్ | 'మంగయాక్కరసి' |
| మహారాణి | 'మారాగి కేమరి' |
| పారగన్ | 'షెహనాయి' |
| సరస్వతి | 'చక్రధారి' |
| పమూనీ | 'బ్లడ్ అండ్ శాండ్' |
| Casino: | 'Daughter of the Jungle' |
| Minerva: | 'Sind bad the Sailor' |
| New Globe: | 'Manhandled' |
| New Elphinstone: | 'Canadian Pacific' |
| Roxy: | 'The Good Earth' |

### ప్రకటన

కంబంలో (కర్నూలు జిల్లా) మా ఆంధ్ర దైనిక, సచిత్రవార, భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు, క్రొత్తగా శ్రీ సి. కృష్ణమూర్తిగారిని 1-12-49 తేదీనుండి నియమించడమైనది.

* * *

గిద్దలూరులో (కర్నూలు జిల్లా) మా ఆంధ్ర దైనిక, సచిత్రవార, భారతి మాసపత్రికలను వారి స్వంతబాధ్యతపై విక్రయించుటకు శ్రీ ఓ. వి. రమణయ్యగారిని 1-12-49 తేదీనుండి నియమించడమైనది.

మేనేజరు,
ఆంధ్రపత్రిక, జి. టి. మద్రాసు.













## "ఆంధ్రదేశ ప్రాజెక్టు వ్యవహారాలను మందగమనంతో సాగించాలి"

### ప్రభుత్వంలోని ఆంధ్రేతరవర్గాలభావన

### విభజననుగూర్చి ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘ వ్యాఖ్యానికి ఒక ఆంధ్రమంత్రుల ప్రత్యుత్తరం

అసలు మామూలుగానే ఆంధ్ర దేశానికి సంబంధించిన ప్రాజెక్టులు, వగైరాల వ్యవహారాలు చాలా మందంగా సాగుతూ ఉంటవి. ఇప్పుడు అసాధారణ పరిస్థితులు వీర్పడకపోయినా, విశేష పరిస్థితు లేర్పడినవి. నేడో రేపో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం జరిగి తీరుతుంది. కనుక ఆంధ్రప్రాంతానికి సంబంధించిన ప్రాజెక్టుల విషయంలో చెన్నరాష్ట్ర ప్రభుత్వం అసలే ఏమీచేయ నవసరంలేదనే భావం ప్రభుత్వంలోని ఆంధ్రేతరవర్గాల్లో ప్రబలివున్నది, ఆ కారణంగా ఆంధ్రప్రాజెక్టుల వ్యవహారం పూర్తిగా వెనకబడిపోయినట్లు తెలుస్తున్నది.

శాసనసభ నాయకులు అయిన ఒక ఆంధ్రమంత్రి తమిళాంధ్ర దేశములకు ప్రభుత్వవ్యవహారములలో ఏట్టిపక్షపాతము చూపబడుటలేదని ఒక బహిరంగసభలో ఉద్ఘాటించినను మంత్రివర్గములోనిమిగతా ఆంధ్రమంత్రులు వారి అభిప్రాయములతో ఏకీభవించుటలేదనియు, ఆంధ్రదేశ వ్యవహారములు, ఆంధ్రులు ప్రస్తుత మంత్రివర్గములో అల్పసంఖ్యాకులైనందున ఎంతో కాలముగా దబ్బతినుచున్నవనియు, విభజన ఆలోచనలు తీవ్రమైనతరువాత ఆ భేదభావములు మరీతీవ్రమైనవనియు తెలియుచున్నది.

డిశంబరు ఆరవ తేదీన మంత్రివర్గసమావేశము జరుగులోపున ఆంధ్రరాష్ట్ర అవతరణ ఎప్పుడుజరుగవలసినదీ, ఆస్తి అప్పుల పంపకము ఏ విధముగా జరుగవలసినదీ ఆంధ్రనాయకులతో సంప్రదించవలెనని ఆంధ్రకాంగ్రెసుసభ్యులు అభిప్రాయపడుచున్నారు. జనవరి 26 వ తేదీ లోపున గవర్నరు జనరల్ ఉత్తర్వునిచ్చునటుల ఆంధ్రనాయకులు మంత్రులు చాతుర్యముతో వర్తించవలెననియు, ఏప్రిల్ 1 వ తేదీకి ఆంధ్రరాష్ట్రము అవతరించునట్లు యత్నించవలెననియు ఆంధ్ర కాంగ్రెసువారిలో బలీయమగు అభిప్రాయ మేర్పడి ఉన్నది.

ఆంధ్రరాష్ట్ర విభజనవ్యవహారములలో ఆంధ్రులకు అన్యాయము జరుగకుండా జాగ్రత్తతో ఉండవలెనని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు ఆంధ్రమంత్రులకు చేసిన హెచ్చరికపై ఒక ఆంధ్రమంత్రి వారికి సమాధాన మిచ్చుచూ ఈ భారమంతయూ ఇతరులపై త్రోసివేయుటయే గాక, వారు కూడా వచ్చి పంచుకొనవలెనని కోరినటుల తెలియుచున్నది. మరొక ఆంధ్రమంత్రి విభజన వ్యవహారములలో ఏది యుక్తమో అంతమేరకు తాము వర్తించగలమని రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులకు వ్రాసినటుల తెలియుచున్నది.

కేంద్రప్రభుత్వ హోంశాఖ కార్యదర్శి హెచ్. వి. ఆర్. అయ్యంగారు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమును గూర్చి తయారు చేసిన లేఖ, రాముపాదసాగరముపై మద్రాసు ప్రభుత్వ పబ్లిక్‌వర్క్సుశాఖ కార్యదర్శి వర్గీస్ గారు తయారుచేసిన నివేదికను మించి ఉన్నదని ఒక ఆంధ్ర నాయకుడు ఆంధ్రపత్రిక ప్రతినిధితో తెలిపెను. రూ. 135 కోట్లు నిర్మాణమునకు అగునని బ్రహ్మాండమైన భారము ఉన్నదని వర్గీస్ గారు రాముపాదసాగరము సందర్భమున చూపినట్టే ఆర్థికస్థితి, ఆస్తి అప్పులు, ఉద్యోగులు, కేయ్యనిస్టు సమస్యలను అవసరానికి మించిన ప్రాధాన్యమును అయ్యంగారు చూపినారనియు, ఎప్పుడు ఆంధ్రరాష్ట్రము విడిపోయినా అవి తేలవలసినవిగాని ఇప్పుడు క్రొత్తగా వచ్చిన ప్రత్యేకత లేదనియూ, వారు తెలిపిరి. వర్కింగుకమిటీ వారు తక్షణమే ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు తగు చర్య తీసుకొనవలెనని కోరగా చర్చలపేరిట కాలవిలంబన చేయుట సబబుగాదనియు, కేంద్ర ప్రభుత్వం వారి లేఖ ఇంకను నిర్మాణాత్మకముగా సహాయకరముగనూ ఉండవలసినదని ఆంధ్ర ఉద్యోగవర్గములవారు అభిప్రాయ పడుచున్నారు.

చెన్నపట్నంలో ఆంధ్ర రాజధాని తాత్కాలికంగా ఉంచటానికి, బళ్లారిలోని ఆరు తాలూకాలను ఆంధ్రరాష్ట్రంలో తాత్కాలికంగా చేర్చటానికి వాటికి కేంద్రప్రభుత్వ హోం శాఖ కార్యదర్శి పెద్ద సమస్యలుగా చేయక ఒక విధముగా స్పష్టమైన అభిప్రాయమును తెలిపిన మద్రాసుప్రభుత్వము, అందుకు సంబంధించిన తదితరులు అంగీకరించెదవారని ఇచ్చట రాజకీయ వర్గములవారు అభిప్రాయపడుచున్నారు.

## వలస దేశాలు: సమితి ఆదేశం

(1 వ పేజీ తరువాయి)

పాలకరాజ్యాలు పాలితదేశాల విషయమై ఈ కిందివిధంగా ప్రవర్తించాలని సమితి సర్వసభ్య సమావేశం నేడు తీర్మానించింది.

(1) పాలకరాజ్యాలు ప్రతిసంవత్సరమూ, పాలితదేశాల ప్రజల ప్రాథమిక హక్కులు ఏవిధంగా ఉన్నదీ, ఆదేశాల చారిత్రక భౌగోళికరక్ష వ్యవహారాలనూ గురించి సమితికి తప్పనిసరిగా నివేదికలు సమర్పించాలి.

(2) ఈవార్షిక నివేదికలలో పాలితరాజ్య ప్రజల రాజకీయాభ్యుదయాన్ని గురించి కూడ వివరించ బడుతుందని సమితి ఆశిస్తున్నది.

(3) యూరపియన్లకూ, పాలిత ప్రాంతాల ప్రజలకూ విద్యాసౌకర్యాల విషయంలో ఎటువంటి భేదమూ చూపించవద్దని సమితి కోరుతున్నది. పాఠశాలల్లో విద్యా సంతరనకూ ప్రాంతీయ భాషలనే వాడవలసినదని సమితి కోరుతున్నది.

తానునియమించిన ప్రత్యేక సంస్థలతో పూర్తిగా సహకరించాలని కోరుతున్నది.

చర్చలో ఫ్రెంచి ప్రతినిధి మాట్లాడుతూ వలస దేశాలపై సమితి ఆజ్ఞాయిషీ, నెలకొల్పటానికి ప్రయత్నాలు జరుగుతున్నవనీ, సమితి నియమావళిని చట్టి సమర్పించబడిన నివేదికలను దిశాగ్గా చేయటం మినహా ఆ విషయమై సమితికేమీ అధికారం లేదనీ వాదించాడు.

భారత ప్రతినిధి శివరావు సమాధానమిస్తూ ఇందులో సమితి నియమాలను సవరించే సూచనే లేదని అన్నాడు.

"సమితి ప్రత్యేకంగ కిందనేని కోట్ల కొలది ప్రజలు సాధ్యమైనంత త్వరలో స్వాతంత్ర్యాన్ని సంపాదించటానికి తోడ్పడేట్లుగా మనం సమితి నియమాలకు ఎక్కువ అవకాశలను కలిగించాలి. ఈ శాశ్వత సమితికి ఉండటంలో అక్రమమేమీ లేదు. ఆ శాశ్వతసమితి పనులు లోదు. నిజానికి నివేదనల పరిశీలనకు వీర్పడ్డ ప్రత్యేక సంఘం శాశ్వతంగానే ఉండవలసింది.

మూడు పంక్తుల కిందట 74 పరపాలిత దేశాలు ఉండేవి: కాని వాటిలో పన్నెండు దేశాలకు స్వపరిపాలన వచ్చినట్లు చెప్పబడుతున్నది. పాలక రాజ్యాలు నిరంకుశంగా చేస్తున్న నిర్ణయాలను వట్టి, సమితి కోరుతున్న అంశాలన్నిటి మీదా నివేదికలు రావటం అవసరం.

పాలిత దేశాల్లో విద్య, సాంఘిక కార్యక్రమాల కన్నా సమితి ఎక్కువ శ్రద్ధతో పరిష్కరించ వలసిన సమస్యలు అనేకం ఉన్నవి. భూసారం కొట్టుకొని పోవటం, నిస్సారమైన ఆహారాన్ని తినటం, ఆస్తికాలు కలసపల్లిన కూలీల సమస్య, చిన్న పిల్లలు నేరాలు చేయటం, ప్రజారోగ్య పరిస్థితులు హీనతి మొదలైనవి వాటిలో కొన్ని" అని ఆయన ప్రసంగించారు.

# సోవియట్ రష్యా నిజస్వరూపం

రచన: ఫ్రైదా ఉట్లే

## 6

## విచ్ఛిన్న విభ్రాంతి

[ఫ్రైడా ఉట్లేసతి రచించిన విచ్ఛిన్నవిభ్రాంతి యను గ్రంథములోని ఆరవ అధ్యాయ సంగ్రహామిది. సోవియటురష్యాలోని ఆస్పత్రియందు ఆమె అనుభవించిన ఘోర దురవస్థను యీ అధ్యాయములో వర్ణించినది. రష్యాలోని ఏ ఉచిత వైద్యసహాయ సౌకర్యమును గూర్చి గొప్పగా చాటింపబడెనో దానిని గూర్చియే ఆమె విచారించుచున్నది. అంతేగాక, బోల్షివిజముయొక్క తత్వార్థమును ప్రత్యక్షానుష్ఠానమును ఆమె యీ అధ్యాయములోని విమర్శించినది.]

సోవియటురష్యాకు విచ్చేసెడి విదేశీయులు యిచటి ఉచితవైద్య సహాయమును గూర్చియు, ఇచటి ఆస్పత్రులను గూర్చియు ప్రోత్సాహము చేయుట కలదు. అట్టిరష్యను ఆస్పత్రులతో సంబంధము నాకు మొట్టమొదటిసారిగా నేను మాస్కోయందున్న రెండో సంవత్సరపు శీతకాలంలో సంభవించింది. నేను గర్భిణినైయుంటిని కొత్త సంవత్సరాది పూర్వదినమున అదృష్టవశాత్తుగా నాకు ఒకచోట ఇరువదిరెండు పౌనుల బంగాళాదుంపలు లభించెను. గర్భవతినైన నేను వాటిని ఇంటికి మోసుకొనిపోవుటలో అవ్యక్తంగా ప్రవర్తించాను. ట్రాంబండిలో జనం క్రిక్కిరిసియున్నారు. దానిలో ఎక్కుటకున్నూ దానినుంచి దిగుటకున్నూ నేను జనాన్ని త్రోసికొనిపోయే అవస్థలో నా కళ్లజోడు ఊడి క్రిందపడిపోయింది. ఈ కండ్ల అద్దములను తీసికొనుటలో బండిలోని జనం నన్ను నిర్దాక్షిణ్యంగా నలిపివేసినారు.

ఇంటికి చేరేసరికి చాలా అలసిపోతిని. నాకు నీరసం కూడా వచ్చింది. ఈ త్రొక్కిసలాటలో నా శరీరానికి నేనే ప్రమాదం తెచ్చిపెట్టుకున్నాను. ఆ సంగతి నేను గ్రహించలేదు. సంవత్సరాదిపండుగ పూర్వదినమున ఆ నాటిరాత్రి నా స్నేహితురాలైన జేన్ ఇంటిలో విందుకు నేను వెళ్లితిని. అర్ధరాత్రియగుసరికి నాకు వంట్లో సుస్తీ ఏర్పడింది. ఆ రాత్రియంతయును, జేన్ ఉండే పెద్దగదిలోనే ఆమెతో కలిసి ఉన్నాను. మరొక మిత్రుడు మైకేలు కూడా ఆరాత్రి మాతోనే ఉండెను. అతడుకూడా బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడు. అతడు 1931 సం|| ఆరంభములో ఇంగ్లాండు నండి మాస్కో నగరమునకు వచ్చియుండెను.

మరునాటి ఉదయము జేనున్నూ, నా భర్తయగు ఆర్కేడీయున్నూ ఆఫీసులకు వెళ్లినపిమ్మట మైకేలు ఒక్కడు మాత్రము నాతో ఉండెను. అప్పుడు నాకు గర్భస్రావమైనది. నా భర్తయగు ఆర్కేడీగారికి ఆఫీసుకు టెలిఫోను ద్వారా యీ సంగతి తెలియజేయవలెనని మైకేలు ప్రయత్నించెను. కాని, ఆతని ఆఫీసులో ఒక్కటే టెలిఫోను ఉంది. అదికూడా ఆ సమయంలో చెడిపోయింది. అందువల్ల టెలిఫోన్లో నా భర్తకు యీ సమాచారము మైకేలు తెలియజేయలేకపోయెను. అందువల్ల జేనును ఇంటికి రప్పించి, తాను ఒక "డ్రోష్కీ" బండిఎక్కి ఆర్కేడీకొరకు వెళ్ళెను.

ఒక డాక్టరును తీసికొనివచ్చుటకై ఆర్కేడీగారు రెండుగంటలసేపు ప్రయత్నించెను. చిట్టచివరకు కిరాయి డాక్టరును ఒకఆమెను వెంటబెట్టుకొనివచ్చెను. కాని, కార్మిక సంఘములో చేరి నేను సేవచేయుచున్నందుకు, నాకు ఏ డాక్టరు ఉచితంగా వైద్యం చేయవలసియుండెనో ఆ డాక్టరు ఆరుగంటల తర్వాత వచ్చెను. ఆ మనిషి ఒక డాక్టరులాగున లేనేలేదు. ఒక మురికిలేకి దోక్కపడుచు మనిషి పోజై౦ది. ఆమె నన్ను తాకుటకు గూడా నేను అంగీకరించే దానిని కాదు. నేను అస్వస్థతగా వున్నానని ఒక సర్టిఫికేట్టును నా ఆఫీసుకుపంపే నిమిత్తమై ఆమె నాకు వ్రాసియిచ్చింది. ఆమె రావడంవల్ల నాకు అంతకన్నా ఎక్కువ ఉపయోగం లేదు.

సాయంకాలం ఆయ్యేసరికి నాకు నొప్పి తగ్గినది. అసలు డాక్టరు నాతో చెప్పింది ఏమిటంటే, నాకు నొప్పి ఎక్కువ కాని రోజుల, నేను కదలకుండా పరుండుటతప్ప ఇంకేమీ చేయనక్కరలేదని చెప్పింది. ఒకవేళ నా బాధ హెచ్చినయెడల, సమీపంలో ఉన్నటువంటి "గర్భస్రావాలయము" నకు వెళ్ళి గర్భాశయము ఖాళీ చేయించుకొని శస్త్రవైద్యం చేయించుకోవలెనన్నది.

మరునాడు మధ్యాహ్నము సమయానికి నాకు బాధ ఎక్కువైంది. ఆర్కేడీగారికి మా మిత్రుడు మైకేలు టెలిఫోనులో యీ విషయం తెలియజేసి, ఆర్కేడీగారు వచ్చేవరకు నా మంచంప్రక్కనే మైకేలుగారు కూర్చుండి నన్ను ఓదార్చుచుండెను. ఇంతలో ఆర్కేడీ ఒక కిరాయి మోటారు కారును సంపాదించి నన్ను ఆస్పత్రికి చేర్చినారు. అక్కడ ఆస్పత్రిలో ఆయన నన్ను దిగవిడిచి పోవలసినవాడయ్యెను.

ఆపరేషనుచేసే బల్లమీద నన్ను పడవేసి తోలుపట్టీలతో కదలకుండా బిగించిరి ఒక అనస్థీషియా ఇచ్చి నేను కదుల్కొనకుండా ఆపరేషను ప్రారంభించింది. ఆమె పెదవుల రంగు ముఖం మెరుగు పూతలు చూస్తే నాకు ఆమె పల్లెకు వ్యభిచారిణిగా కన్పించింది. గాని డాక్టరులాగున కన్పించలేదు.

ఆపరేషను చేసేముందు నాకు మత్తుమందు యివ్వలేదు. అందువల్ల ఆపరేషను చేస్తూఉంటే యమబాధగా ఉంది. అప్పుడు నన్ను మేడమీద ఉండే ఒక చిన్నిగదిలోకి తీసికొనిపోయిరి. ఆగది 12 అడుగుల పొడుగు 12 అడుగుల వెడల్పు ఉంటుంది. ఆగదిలోనే అయిదుగురు రోగులకు ప్రక్కలు వేసియున్నవి. నాకు మంచుగడ్డ సంచీఒకటి యిచ్చేసి ఆస్పత్రి నర్సులు నన్ను అక్కడ విడిచిపెట్టి వెళ్ళిరి. నావద్దకు తర్వాత వచ్చినవాళ్లులేరు. ఆపరేషను అయినతర్వాత నా శరీరం శుభ్రంచేసిన వాళ్ళూ లేరు. నా గదిలో నర్సుగాని ఎవ్వరూ లేరు. నా వెంట నేను తెచ్చుకొన్న సబ్బుముక్కను తమకు యివ్వవలసినదిగా నాగదిలో ప్రక్కనున్న రోగులు నన్ను యాచించారు. ఆ గదిలోని అయిదుగురు రోగులలో సబ్బు ఒక్కొక్కటున్నటువంటి రోగిని నేను ఒక్కతెనే మిగిలిన వాళ్లకెవ్వరికీ ఆస్పత్రిలో సబ్బు సప్లయి చేయలేదు.

మరునాడు ఉదయం సుమారు 11 గంటలకు గంజి ఆహారం యిచ్చిన పిమ్మట, నన్ను లేచి మేడమీదనుంచి క్రిందికిరమ్మన్నారు. నాకు ఇంకా రక్తం స్రవించుచున్నదనియు, లేచి నడచుటకూ నిసనిరియు నేను ఎదిరించి జవాబు చెప్పితిని. కాని అక్కడ నామాట లక్ష్యంచేసిన వాళ్లులేరు. క్రిందకు నేను వచ్చిన తర్వాతనన్ను ఆపరేషను బల్లమీద తిరిగి పరుండబెట్టి నలుగురు తైనాతీలు నన్ను అదిమిపట్టి కత్తితో శస్త్రం చేయడం ప్రారంభించారు.

"రెండుసార్లు ఎందుకు?" అని నేను గోలచేస్తూ అరిచాను. కాని నామాట ఎవ్వరూ చెవిని పెట్టనేలేదు. అంతటితో నేను నిస్త్రాణవచ్చి అశక్తురాలనైతిని. ఏడుస్తూ పడిఉన్నాను. అమితమైన బాధతో గత రెండురోజులనుంచీ అవస్థపడుచు నేయుంటిని. నేను పడేబాధ దేవునికే తెలియాలి. అది యమ బాధ- ఆస్పత్రిలోని ప్రదేశం మురికికూపంగా ఉంది. నా శేవా దమ్ముల కొంపలో ఉన్నట్లుగా ఉంది. నాకు స్రవించుచున్న రక్తమును తుడిచి వేసికొనుటకై ఏదైనా యివ్వవలెనని నదని నర్సును అడిగితిని- నేలమీద పడియున్న ఒక మురికి గూడ ఉండెను తీసి నర్సు నాచేతికిచ్చింది.

ఈయను ఆస్పత్రిలోనుంచి బయటపడవలెనని నిశ్చయించుకొన్నను ఇక్కడ ఏదైనా పెద్దవ్యాధి నాకు సంక్రమించక పూర్వమే వదలిపోవలెనని నిశ్చయించుకొన్నాను. నన్ను ఎట్లాగైనా ఆస్పత్రిలోనుంచి తొలగించే ఉపాయం చూడవలసినదిగా నా భర్తయైన ఆర్కేడీగారికి ఒక కాగితం వ్రాసిపంపితిని. మొట్టమొదట ఆస్పత్రి అధికారులు నన్ను వెళ్లనివ్వలేదు. కాని, నేను పత్రికా రచయితనైన ఆంగ్లేయ స్త్రీనని అధికారులకు నా భర్త తెలియజేయగా వారికి కొంత బెదరు పుట్టినది.

పరిపక్వంగా ఉండే మంచి యౌవన స్త్రీయను ఆడ డాక్టరొకటి ఫ్రెంచి భాష మాట్లాడుచు నావద్దకు వచ్చెను. మొట్టమొదట నాకు ఆపరేషను చేసిన డాక్టరు నా చికిత్సావివరణ కాగితం మీద నాకు ఆపరేషను అయినట్లుగా వ్రాయడం మరచిపోయినదనిన్నీ, అందువల్ల రెండోసారికూడా ఆపరేషను చేయడం జరిగినదనిన్నీ ఆమె నాకు వివరించి చెప్పింది.

నాకు ఉపచారములు జేన్ చేస్తానన్నది. నన్ను ఆస్పత్రినుంచి పంపించిరి. ఈయన ఆస్పత్రినుంచి బయటపడి తిరిగి పరిశుభ్రమైన గదికివచ్చి జేన్‌తో కలిసి ఉండగలిగినందుకున్నూ, మైకేలువద్దకు రాగల్గినందుకున్నూ నేను పొందిన ఆనందం ఇంతా అంతా కాదు. ఒక వారంరోజులవరకు నేను ప్రక్కమీదనుంచి లేవలేదు. మాకందరికీ జేన్ వంటచేసేది ఆర్కేడీ సాయంకాలం భోజనానికి వచ్చేవాడు. 8 గం||గాని 9 గం||గాని అయితేనేగాని ఆర్కేడీగారు ఆఫీసునుంచి ఇంటికి చేరేవారుకాదు. ఆయన నాకంటె ఎక్కువ నవసంగాను ఆరోగ్యస్థితిం లేకుండా ఉన్నారు. అవస్థ మూలంగా ఆయనకు ఆరోగ్యం చాలా చెడింది.

నాకు బిడ్డ ప్రాప్తం లేకపోవడం ఒకవిధంగా కీడులో మేలు. తాత్కాలికంగా నేను కొంత మనస్తాపం పొందినప్పటికీ అది నా మంచికేవచ్చింది. అటుపిమ్మట రెండు సంవత్సరాలవరకు కూడా మేము కాపురముండుటకు స్థిరంగా ఒకగది దొరకనేలేదు. ఒకగదినుంచి ఇంకొకగదికి నిరంతరంగా మారుతూ ఉండవలసి వచ్చినదేమంటే మేము ఒకబిడ్డకూడా ఉండి నట్లయితే, మాకెటి ఏమయ్యేదో భగవంతునికే తెలియాలి.

ఆ సంవత్సరం శీతకాలంలో జేన్‌తో నున్నూ మైకేలుతోనున్నూ మేము కలిసియుండుట మూలంగా మా కష్టాలుమాకు కన్పించలేదు. స్వదేశంలో ఇంగ్లండులో ఉన్న కాలమందు బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీలో ఒకేదియందు మైకేలున్నూ నేనూ, కలిసి పనిచేస్తూ ఉండేవాళ్లం. "డెయిలీవర్కరు" అనే పత్రికయొక్క ప్రతులను మేమిద్దరంకలిసి అమ్ముతూఉండేవాళ్లం. నేను లండను వీధులలో ఉపన్యసిస్తూ ఉండినదినములలో మైకేలు నా అంగరక్షకుడుగా ఉండి నన్ను కనిపెట్టి చూస్తూ ఉండేవాడు.

మైకేలున్నూ, జేనున్నూ నేనున్నూ కలిసి బోల్షివిజం తత్వసిద్ధాంతములను విమర్శిస్తూ గంటల తరబడిగా వెళ్లించేవాళ్లం. రష్యాలోని ప్రస్తుత దౌర్భాగ్య స్థితిగతుల కారణములనుగూర్చి తర్కిస్తూ ఉండేవాళ్లం. మైకేలు ఎప్పుడున్నూ మార్క్సు తత్వధోరణిలోనే మాట్లాడుతూ ఉండేవాడు. లెనిను ఒకవేళ జీవించియుండినప్పటికిన్నీ రష్యా దేశచరిత్ర ఈ పంథాలోనే తప్పక నడిచేది అని మైకేలు వాదించేవాడు. కాని లెనిను జీవించియుండినట్లయితే, అతనికూడా ట్రాట్స్కీకి పట్టినగతియే పట్టేది అని జేన్ వాదించేవాడు కాని నావాదన ఏమిటంటే అట్లా జరిగినప్పటికీ, విప్లవానికి మరొక ప్రతిష్ఠవము రష్యాలో బయలుదేరినదనే సంగతి ప్రపంచానికి బోధపడేది.

ఎప్పుడైనా అరుదుగా ఆర్కేడీకి తీరిక లభిస్తే మాతో కలిసి వాదించేవాడు. నేటి రష్యాకు పునాది వేసినవాడు లెనిను తప్ప మరొకడు కాదని ఆయన వాదన. మొదటి ప్రపంచ సంగ్రామానికి పూర్వము స్విజర్లండు దేశములోని జూరిక్ విశ్వవిద్యాలయములో ఆర్కేడీ గారు చదువుకొనుచుండిన దినములందు స్విజర్లాండులో ఉంటూఉండిన లెనిను యొక్క ఉపన్యాసములను ఆర్కేడీ విని యుండెను. లెనినుతో స్వయంగా కలిసికొని ఆర్కేడీ మాట్లాడియుండెను.

అప్పట్లో లెనిను వెల్లడించిన అభిప్రాయమునుబట్టి సోషలిజం అనగా సామ్యవాదమును స్వస్థలాలో నికి తీసికొనిరావలెనంటే ప్రజాభిప్రాయ నిర్ణయానుసారంగా స్వయపహారం సాగించుటకు వీలులేదని లెనిను చెప్పెను. ఈ తత్వోపదేశములు నా భర్తయైన ఆర్కేడీగారికి అపహ్యకరములుగా నుండెను. అయినప్పటికిన్నీ ఇప్పుడు నా భర్త వాదించేది ఏమనగా, లెనిను చెప్పినదే సరియైన పద్ధతికావచ్చు. ఎందుకనగా ఇప్పుడు రష్యాలో ప్రబలియున్న భయానక ప్రభుత్వాధికారమున్నూ, లేమియున్నూ క్రమేణా తొలగిపోయి ప్రజాస్వాతంత్ర్యమున్నూ సుఖమున్నూ బహుశః ఏర్పడవచ్చుననే ఆర్కేడీ గారి వాదన.

ప్రజాసామాన్యమును పీడించేటటువంటి కమ్యూనిస్టులనెడి ఉన్నతస్థాయిగల వర్గమునకు నిరంకుశాధికారం ఒప్పచెప్పుటకు పునాదివేసినవాడు లెనిను. లక్ష్యమును సాధించుటయే ముఖ్యంగాని, అందుకొరకై అవలంబించెడి సాధనవిధానం ముఖ్యం కాదని లెనిను భావించియుండుటవల్లనే ఇటువంటి పరిస్థితులను లెనిను తెచ్చిపెట్టినాడనే విషయమును ఆర్కేడీగారు ఇంకా అంగీకరించుట లేదు.

ధనికవర్గము ప్రబలమైనప్పుడు కార్మికవర్గములో విప్లవకారులు సహజసిద్ధంగా ఉద్భవిస్తారని మార్క్సుయొక్క సిద్ధాంతము. కాని 1914 సం||కు పూర్వము అట్టిది సంభవింపదని లెనిను గ్రహించెను. కాని 1914 సం|| తర్వాత లెనిను గ్రహించినదేమనగా, కార్మికులు మున్ముందుగా దేశభక్తినే ప్రధానంగా చూపిస్తారనియు, అటుపిమ్మటనే, వారు తాము తక్కువతరగతివారమనే గ్రహింపుతో విజృంభిస్తారనియు లెనిను గ్రహించెను. కాని అంతమాత్రం చేత మార్క్సుసిద్ధాంతమును లెనిను త్రోసివేయలేదు. లెనిను అవలంబించిన కార్యసాధన విధానం విప్లవమార్గం తప్ప మరొకటికాదు. కార్మికులకు ఏది శ్రేయస్కరమో కార్మికులకంటె ఎక్కువగా గ్రహించినట్టివిప్లవదీక్షాపరులే యీ విప్లవమును సాగించవలెనని లెనిన్ సంకల్పం. కార్మికులకు శ్రేయస్కరమైనదే సోషలిజం దానిని సాధించుటకే విప్లవం సాగించాలి. కాని, యీ విప్లవ మార్గంలోనికి దిగకుండా కార్మికులు తొలగిపోగలరనే భయం లెనినుకుకలదు. కనుక కార్మికులు విప్లవంలోనుంచి తొలగిపోకుండా బందోబస్తు చేయుటకై కమ్యూనిస్టుపార్టీ అనేది ఒకటి అవసరమని లెనిను భావించెను. లెనిను మొదటినుండియు జనసామాన్యాన్ని శంకిస్తూనే ఉన్నాడు.

"రాజ్యపత్వాన్ని నిర్మూలించుటకు రాజ్యపు పద్ధతులనే అవలంబించుటకై బోల్షెవిక్కులు జనద్రోహులు" అని లెనిను వ్రాసెను. పాశ్చాత్య నాగరికతను రష్యా రాజ్యం జీర్ణంచేసికొని అనుభవంలోనికి తెచ్చుకోవలెనంటే, నియంతాధికారపద్ధతులను అనుసరించుటకు భయపడనక్కరలేదనికూడా లెనిను వాదించెను. కాని, చిట్టచివరకు తనపార్టీవారే నిరంకుశాధికారులై ఆసియా ఖండంలోని ఘోర చండశాసనయులచలాయించే అధికారాన్ని కూడా చలాయించుటకు అవకాశములను కల్పించినట్లయినదనే విషయమును లెనిను కాలం మించినపిమ్మట గ్రహించినవాడయ్యెను.

వెనుకటి జారుచక్రవర్తులనాటి ఘోర చండశాసనాధికారంకంటెను ఘోరమైన చండశాసనాధికారం చలాయించే ధోరణిలోనికి రష్యను ప్రజలను యీ విప్లవం యీడ్చుకొని పోతున్నదని లెనిను గ్రహించి యీ ధోరణిని యీ పెల్లుగను అరికట్టుటకు తన అవసానదశలో పూర్వము కొన్ని వృథాప్రయత్నములు మాత్రము చేసెను. అప్రవాహ తరంగములను వెనుకకు మరలించుట అతనికి అలవి కాని పనియయ్యెను.

మాస్కో నగరమందున్న రెడ్ స్క్వేర్ లో భద్రపరచబడిన శరీరమును నేనుచూచినప్పుడు, అతని ముఖముమీద చిరునవ్వు చూడగా, తన చర్యల పైపరిణామమునకు వికటముగా నవ్వుచుండినట్లుగా నాకు కన్పించెను. "భగవంతుడా నన్నెందుకు యీరీతిగా వినోదాడితివి?" అని అంత్యఘడియలో మొఱపెట్టుటకుకూడా ఆయన నమ్మిన భగవంతుడుకూడా లేడు. కాని, అతని ముఖముమీద నవ్వు చూస్తే, తన జీవితకృషియంతయును దారుణమైన ఆయోగ్యమైన ఫలితముల నొసంగినదనే భావంతో తనలో తాను నవ్వుకొనుచున్నట్లుగా గోచరించినది.

## ఆరోగ్యవైద్యం

శ్రీ
కొడవటిగంటి
కుటుంబరావు

### మలబద్ధకం

మలబద్ధకం పెద్ద వ్యాధి కాదు కరిర తత్వం ఆటే పాడుకాకుండానే మలబద్ధకం కలగవచ్చు. మలబద్ధకంకంటె, దానిని పోగొట్టటానికి విక్రయించే మందులు శరీరతత్వాన్ని ఎక్కువ పాడు చేస్తాయి అటువంటిమందులను విక్రయించేవారు మలబద్ధకం ప్రమాదమైనదని ప్రచారంచేస్తారు. నిజానికి మలబద్ధకంకంటె అతిసారం (నీళ్లవిరేచనాలు) ఎక్కువ ప్రమాదకరమైన వ్యాధి.

ఈ క్రింది ఔషధాల సహాయంతో మలబద్ధకాన్ని సులభంగా నివారించేసుకోవచ్చును.

శరీరవ్యాయామం చేయనివారికీ; నిషావస్తువులు సేవించేవారికీ; మితిమీరి భోగం చేసేవారికీ; నీళ్ళవిరేచనాలు అణచిపెట్టడంవల్ల గాని, అవి నిలిచిపోయిన అనంతరంగాని వచ్చే మలబద్ధకానికీ; ఆకలి లేకపోవడమూ, అరుచీ, నాలిక జిగురుగానూ పూతగలిగీ ఉండడమూ, పొట్ట బరువుగా ఉండడమూ, ముఖం వేడిగా ఉండడమూ, తలనొప్పి పనిచేయడానికి ఇచ్ఛ లేకపోవడమూ, నిద్ర సరిగా పట్టకపోవడమూ, ఊపిరి తీయడం కష్టంగా ఉండడమూ, చిరాకూ, విసుక్కోవడమూ ఉన్నప్పుడు "నక్సువామికా" ఇవ్వాలి

కొవ్వుతో కూడిన పదార్థాలు విస్తారంగా తిని మలబద్ధకం తెచ్చుకున్న వారికి, విచారగ్రస్తులుగా ఉన్న వారికి "కల్కేరియా" పనిచేస్తుంది.

రోగి చిరచిరలాడుతూ ఉన్నప్పుడూ, రోగికి చలిగా ఉన్నప్పుడూ, మలబద్ధకం వేసవిలో జాస్తిగా ఉంటేనూ, వాతపు నొప్పులున్న వారికి "బ్రయోనియా" పని చేస్తుంది.

దొడ్డికి వెళ్లవలసిన తొందరఉండి కూడా ఆసనం మూసుకుపోయినట్టున్నా, తొందర సరిగా కలగకపోయినా, పొత్తికడుపులో బరువుగాని అదుదుగాని ఉన్నా, పొట్ట బిగదీసి ఉన్నా, నోరు ఆరిపోవడమూ, దాహమూ ఉండి, ఆకలి లోపించినా "ఓపియం" ఇవ్వాలి.

ఎంతో ప్రయత్నం మీద కొంచెం కొంచెమే విరేచనం కావడమూ, ఆసనం వద్ద దురదా తీపూ ఉండడమూ, విరేచనమైనప్పుడెల్లా శరీరమంతా వణికి పొత్తికడుపు నీరసంగా ఉండడమూ, పొత్తికడుపు ముడుచుకుపోయి బాధగా ఉండడమూ, త్రేపులు కష్టంమీద రావడమూ, ప్రసూతులవల్ల మలబద్ధకం కలగడమూ ఉంటె "ప్లాటినా" ఇవ్వాలి

విడువని మలబద్ధకానికి "లేకెసిస్" పని చేస్తుంది.

పై ఔషధాలు పనిచేయని మొండికేసులకూ, దొడ్డికి వెళ్ళాలనే ఇచ్ఛే లేనప్పుడూ "సల్ఫర్" పనిచేస్తుంది. మలం కొద్దిగాను, గట్టిగానూ, అసమగ్రంగానూ పడినప్పుడూ, పెద్దపేగులో మాత్రమే కదలిక ఉన్నప్పుడూ "నేట్రం మూర్" ఇవ్వాలి.

విరేచనానుసూనం జాస్తిగా ఉండి విరేచనం కాకపోతే "పల్స" ఇవ్వాలి

పసిపిల్లలలో మలబద్ధకానికికూడా ఈ ఔషధాలు వాడవచ్చు, కాని అవి పని చేయనిపక్షంలో ఈ ఔషధాలనుపాలిచ్చే తల్లికిగాని, దాదికిగాని ఇవ్వాలి.

నవంబరు 30 వ తేదీన, శ్రీ జి. యస్. గుప్తాగారి అధ్యక్షతను ఢిల్లీలో జరిగిన భాషాప్రవీణుల సమావేశం. శ్రీయుతులు ఆర్. ఆర్. దివాకర్, డా॥ కె. రాజా, గోపాలచంద్ర సిన్హా, డాక్టర్ చటర్జీ, రాహుల్ సాంకృత్యాయన్, బాలకృష్ణ, వై. ఆర్. దతీ మొదలైన ప్రముఖులు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

షుమారు 5000 కదుర్లుగలది ఒకటి, షుమారు 3000 కదుర్లు గల నూలు వడకు మిల్లులు మాత్రము రెండు గలవు. సుమారు 70 వేల చదరపు మైళ్ల వైశాల్యము గలిగి, సుమారు 2 కోట్ల 75 లక్షల జనాభా గలిగి, అన్ని సాధన సంపత్తులూ, గల ఈ ఆంధ్రదేశమున, నేడు 50 లక్షలకు మించిన మూలధనము గల కంపెనీలు, ఒక్కటికంటె మించి లేదను విషయము గర్వించతగినది కాదు. ఈ దేశమునందు రెండు షెడ్యూల్డు బాంకులు మాత్రమే గలవు. వీటియందున్న డిపాజిట్లు సుమారు అయిదు కోట్లు మాత్రమే. భీమావ్యాపారమునందు కూడ రెండుకంపెనీలు మాత్రమే పనిచేయుచుండెను. ఆంధ్రులు తమ బాంకులను ఇతర ప్రాంతముల యందు స్థాపించలేక పోవుటచే, ఆంధ్రుల ఎగుమతి, దిగుమతి వ్యాపారమునకు అపార నష్టము కలుగుచున్నది. ఈ వ్యాపారమంతయు ఆంధ్రేతరుల హస్తగతమగుచున్నది. అనేక శతాబ్దములకుపూర్వమే నావికా నిర్మాణమున నైపుణ్యమును ఆంధ్రులు సంపాదించినను, ఆంధ్రరాష్ట్రమున సముద్రతీరము పొడుగ నున్నను, నౌకాపరిశ్రమపూర్తిగా వెనకపడియున్న దనవచ్చును. ఆంధ్రేతరులచే విశాఖపట్టణమున స్థాపింపబడిననౌకా పరిశ్రమకూడ, కేంద్రప్రభుత్వ స్వాధీనముకాని అభివృద్ధి యగునట్లు కానరాకున్నది. కనీసము బక్కింగుహాము కాలువను వెడల్పు చేసి, వర్తక సౌకర్యములు కలుగచేయుటకైనను ఏప్రభుత్వము చేయూత నొసంగకుండెను. కావున మద్రాసు రాష్ట్రమందున్న తెలుగు జిల్లాలను, ఇతర జిల్లాలతో పోల్చిచూచిన యెడల, అనేక రెట్లు వెనుకబడి యున్నట్లు స్పష్టము గాకమానదు. హిందూదేశమునందు పరిశ్రమల యందన్నిటిలోను అనగా జాయింటు స్టాకు కంపెనీల మూలమున స్థాపించిన పరిశ్రమలన్నిటిలోను షుమారు రు. 450 కోట్ల మూలధనముగలదు. అందు మద్రాసు రాష్ట్రమున షుమారు రు. 60 కోట్లుగలదు. అందుఆంధ్రరాష్ట్రమున షుమారుఅయిదుకోట్ల రూప్యములమూలధనము మాత్రమే యున్నదని వచించిన, ఆంధ్రదేశము ఎంత అంధకారము నందున్నది బోధపడక మానదు. గత ప్రపంచ సంగ్రామమున, భారతదేశమునందన్ని ప్రాంతముల వారలు, మద్రాసు రాష్ట్రమునందు సయితము ఆంధ్రేతరులు, అనేక పరిశ్రమలను ప్రభుత్వ ఆదరణ రూపమునను దూరదృష్టి పారిశ్రామికుల ధైర్యసాహసముల మూలమునను, సుమారు రూ. 150 కోట్ల మూలధనముతో, స్థాపించినసమయమున, ఆంధ్రులు ఏ విధమైన అవకాశమును తీసికొనజాలక పోయిరి. ఏవో కొన్ని చిన్న చిన్న పరిశ్రమలను స్థాపించిరిగాని, వాటి అభివృద్ధి సక్రమముగనున్నదని తలచుటకు వీలులేదు. అంతియేగాక గత సంగ్రామానంతరమున, మద్రాసురాష్ట్రమునందు నూతనముగా స్థాపింపబడిన వనస్పతి పరిశ్రమకు, ఆంధ్రులు సుమారు ఒక కోటి రూపాయిల పైగా మూలధనము నిచ్చియున్నారు. ఈ పరిశ్రమ పురోభివృద్ధినిగూర్చి, నేడు చాల మంది శంకించుచుండిరి.

ఏ దేశమునందైనను, ఏ ప్రాంతమునందైనను, ప్రజలు తమ ఆర్థిక సౌష్టవమును సరిగా అభివృద్ధిచేసికొనవలెనన్న, ఆయా ప్రభుత్వ ఆదరణ, సహాయము, సంఘీభావము లేనిదే అభివృద్ధి చెందుట కష్టము. ఈ రాష్ట్రమున వివిధములైన పరిశ్రమలు అభివృద్ధి చెందకపోవుటకు, అనేక కారణములను నిర్వచింపవచ్చును. కాని వీటన్ని

# ఆంధ్రదేశపు ఆర్థిక పరిణామం

(8వ పేజీ తరువాయి)

టిలో ప్రభుత్వము తగిన శ్రద్ధతీసికొనక పోవుటయే, ముఖ్యకారణమని విశ్వసింపవచ్చును.

ఇట్లు ఈ రాష్ట్రము ఆర్థికముగ వెనుకబడి యుండుటచేతనే, ఈ రాష్ట్రమును ప్రత్యేకముగ విభాగించిన, ప్రభుత్వపు బొక్కసమున లోటుగలుగుననియు, ఆదాయముకన్న ఖర్చు హెచ్చుగ యుండుననియు, ఆంధ్రులు ఏమాత్రము ఆర్థిక పరిశ్రమాభివృద్ధిని పొందజాలరనియు, అనేకులు అయాచిత సలహాల నొసంగుచుండిరి. థార్ కమిటీవారి నివేదికలోగూడ ఆంధ్రరాష్ట్రపు ఆదాయముకంటె, ఖర్చు సుమారు రు. 6 కోట్లు హెచ్చుగా యుండునని అంచనా వేయబడెను. కాని మద్రాసు ప్రభుత్వపు ఆర్థిక మంత్రి శాసనసభలో తెలిపిన లెక్కల ప్రకారము తెలుగు జిల్లాలనుండి ఆదాయము రు. 12.43 కోట్లనియు, ఖర్చు రు. 18.71 కోట్లనియు, తెలియుచున్నది. అనగా రు. 1.8 కోట్లు మాత్రమే లోటు. కాని ఈ అంకెలకు మద్రాసు ప్రభుత్వమునకు, కేంద్రప్రభుత్వమునుండివచ్చు ఆదాయపు పన్నులోను పొగాకు పన్నులోను భాగము, తదితరములు కలిపినచో, ఆంధ్ర జిల్లాలు, ఏ మాత్రము లోటు లేకుండ, ప్రభుత్వమును నిర్వహింప గలుగుననుటకు సందియము ఇసుమంతైనను లేదు. మద్యపాన నిషేధచట్టము నమలు పరచుట మూలమున, మద్రాసు రాష్ట్రమునకు విక్రయపుపన్ను మూలమునకే హెచ్చు సుంకము వసూలు అగుచుండెను. ఆంధ్రరాష్ట్రమున పరిశ్రమలు హెచ్చుగా అభివృద్ధి గాకుండుటచే, విక్రయపుపన్ను హెచ్చుగా వసూలు గాకపోవుటవల్ల, రాష్ట్రమునకు కొరత ఏర్పడునని కొందరు భయపడుచుండిరి. కాని ఈ రాష్ట్రమునందు వ్యవసాయమును పక్రమముగా వృద్ధిచేసి, వ్యవసాయదారుల ఆదాయముపై కూడ పన్ను విధించిన, రాష్ట్రమునకు హెచ్చు ఆదాయము వచ్చునని విశ్వసింపవచ్చును.

కావున నేడు రాష్ట్రవిభజన జరిగిన వెంటనే, ప్రభుత్వమువారు ఆర్థిక సలహాదారుల సంఘము నొకదాని నేర్పరిచి, రాష్ట్రమునందు ఆర్థిక పరిశ్రమాభివృద్ధి ఎట్లు పెంపొందవలెనను విషయమును సమగ్రముగ ఆలోచించి, కర్తవ్యము నెరవేర్పవలసి యున్నది. అట్లు చేసినచో, రాష్ట్రమునందు, వ్యవసాయపరిశ్రమ, తదితర పరిశ్రమలు ఎగుమతి దిగుమతి వ్యాపారములు సర్వతోముఖముగ అభివృద్ధి చెంది, రాష్ట్ర ప్రభుత్వమునకు హెచ్చు ఆదాయము నిచ్చుచు, రాష్ట్రము లన్నిటికంటెను అచిరకాలములోనే ముందంజ వేయగలుగునని విశ్వసింపవచ్చును.

ఆంధ్రరాష్ట్రము ముఖ్యముగ వ్యవసాయముపై నాధారపడి యున్నదని పైన వివరింపబడినది. ఈ రాష్ట్రమునందున్న పదకొండు జిల్లాలలోను గత జనాభా లెక్కల ప్రకారం 187.12 లక్షల జనసంఖ్య గలదు. ఈ జిల్లాలయందు జనసంఖ్య సాలుకు 1½% వంతున పెరుగుచున్నది. కావున 1950 నాటికి ఈ జిల్లాలయందు 210 లక్షల జనాభా యుండునని అంచనా వేయబడెను. ఆహారపు లెక్కల నిమిత్తము, ఈ జనాభాలో నూటికి 25 వంతులు, పసిపిల్లలు ఉందురని, తగ్గించిన పెద్దలు 158 లక్షలు ఉందురని తేలుచున్నది. అంతర్జాతీయ శాస్త్రవేత్తలు తెలిపిన లెక్కలప్రకారము ప్రతి మానవునకు దినమునకు 1¼ పౌనువంతున బియ్యము పప్పుదినుసులు కావలెను. ఈ లెక్కప్రకారము ఈ జిల్లాలకు 20¼ లక్షల టన్నులబియ్యము, 14 లక్షల రాగులు, జొన్న మొదలయినవి కావలెను. కాని నేడు ఈ రాష్ట్రమున బియ్యము తదితర ఆహార పదార్థములు కలిసి మొత్తము 34.14 లక్షల టన్నులుమాత్రమే ఉత్పత్తి చేయబడుచుండెను. అనగా ప్రస్తుత జనాభాకు తల 1-కి ఒక పౌను వంతుననే ఆహారపదార్థములు పంచినచో, ప్రస్తుతపంట చాలును. మన రాష్ట్రమునం[illegible] ప్రాంతములలో ఆహారపదార్థములను దినమునకు ఒక పౌనుకుపైగా ఇచ్చుట లేదు. మన రాష్ట్రమున ప్రతి మానవునకు పుష్కలముగా 1¼ పౌను వంతున ఆహార పదార్థము లివ్వవలెనన్న ఇంకా 8 లక్షల టన్నుల ఆహారపదార్థములను ఉత్పత్తి చేయవలెను. మన రాష్ట్రమున ఎకరమునకు సగటున 1050 పౌన్లవంతున బియ్యము పండుచున్నది. చైనా, జపాను మొదలగు దేశములయందు ఎకరమునకు సగటున 2500 మొదలు 3000 పౌన్లవంతున బియ్యము పండుచున్నది. కావున మన భూమియందు intensive cultivation అవలంబించినచో ప్రస్తుతపు పంటను కనీసము నూటికి 25 వంతులు హెచ్చింపవచ్చును. అనగా సరియైన విత్తనములనాటి సకాలమునకు నీటివసతులు కల్పించి, సక్రమమైన ఎరువులను సరఫరా చేసినచో, నాలుగైదు సంవత్సరకాలములో ధాన్యపుపంట 25% వంతున పెరుగుననుటకు సందేహము లేదు. శాస్త్రజ్ఞులు, మంచి విత్తనములవలన పంటను 10% వంతునను, సరియైన ఎరువుల వల్ల 15% వంతునను పెంచవచ్చునని, పరిశోధనలు జరిపినమీదట తెలిపిరి.

ఇట్లు ప్రస్తుతము సాగుక్రింద నున్న భూమియందు వెంటనే పంటను హెచ్చించుటకు మార్గాంతరములు విచారించి, నూతనముగ వ్యవసాయమునకు పనికివచ్చు భూమిని సాగుచేయుటకు దగు అవకాశములు చేర్పరుపవలెను. ఆంధ్రరాష్ట్రమునందు కనీసము 30 లక్షల ఎకరములు సాగుబడికి అనుకూలమగు భూమి, నీటివసతులు లేక సాగుబడి చేయబడుటలేదని అంచనా వేయబడెను. వీటిని విచారించి ప్రభుత్వపు సహాయమున, ట్రాక్టరు వగైరా యంత్ర సామగ్రితో, వ్యవసాయమునకు తెచ్చిన యెడల, ఒక పదిసంవత్సరముల కాలములో ఈ రాష్ట్రము ఇతర రాష్ట్రములకు మెండుగా ఆహారపదార్థములను సరఫరాచేసి, తనకు కావలసిన ఇతర సామగ్రిని కష్టము లేకుండ తెచ్చుకొనుటకు అవకాశము కలుగును. అందు ఈ రాష్ట్రమున intensive and extensive cultivation కు కావలసిన Short-term and long-term ప్రణాళికలను వెంటనే తయారుచేయించి, ఈ వ్యవసాయమును అభివృద్ధిచేయుటకు కావలసిన తదితర పరిశ్రమలకు అమలు జరుపవలెను.

పరిశ్రమాభివృద్ధి కావలెనని ఇతర రాష్ట్రములయందున్న పెద్దపెద్ద పరిశ్రమలను, అనగా ఇనుము, సిమెంటు, బట్టలమిల్లులు జనపనార మిల్లులు, మోటారులు విమానములు మొదలయినవాటిని స్థాపించ నెంచకూడదు. వీటికి వలయు ధనము చేకూరుట కష్టము. వాటివలన ఈ రాష్ట్రమునకుకూడ ఫలితము స్వల్పమే. అందు ముఖ్యముగా గమనింపవలసిన విషయమేమనగా, ఇచ్చట 90% జనులు వ్యవసాయముపై నాధారపడియుండిరి. పరిశ్రమలను విశేషము కేంద్రీకరించి, వ్యవసాయకూలీల నందరిని, పరిశ్రమలకు తీసికొనిన, ఇక్కట్టు పెండగుటయే గాని లాభములు స్వల్పము. సామాన్యముగ వ్యవసాయముపై 75% వంతునను, పరిశ్రమలపై 25% వంతునను జనసంఖ్య ఆధారపడి యున్న యెడల రాష్ట్ర ఆర్థిక సౌష్టవమునకు భంగము కలుగదు.

అందుచే ఈ రాష్ట్రమున వ్యవసాయమునే పరిశ్రమగా భావించుమార్గములన్వేషించవలయును. ముఖ్యముగ ఎరువులు కావలెను. Superphosphate, Sulphate of Ammonia తయారు చేయు ఫాక్టరీలను స్థాపింపవలెను. వ్యవసాయపు పనిముట్లు తయారుచేయు ఫాక్టరీలను స్థాపింపవలెను. ట్రాక్టరులను ఇతర దేశములనుండి తెప్పించి చిన్న పనిముట్లు నిచ్చట తయారు చేయవచ్చును. నీటి పారుదలకు సరియైన వసతులు ఏర్పరుపవలెను. అన్నిటికంటె ముఖ్యమైన విద్యుత్ శక్తిని మచ్ ఖండ్ ప్రాజెక్టుకు పూర్తిచేసి, వ్యవసాయకులకు అందుబాటులో నుంచవలెను.

మన రాష్ట్రమున పెద్దపరిశ్రమలు స్థాపించుటకుకూడ పెక్కు అవకాశములుగలవు. నౌకానిర్మాణమును, కేంద్రప్రభుత్వ సహాయమున వృద్ధి చేయవచ్చును. కనీసము చిన్న నౌకలను తయారుచేయించి, కోస్తా వ్యాపారమును వృద్ధిచేసినను రాష్ట్రమునకు అధికలాభము కలుగును. హార్బరులను పునరుద్ధరించవలెను. నాలుగు లేక అయిదు వరకైనను బట్టలమిల్లులను స్థాపించవచ్చును. ఖనిజ సంపదను వినియోగించి, పెద్దపరిశ్రమలను స్థాపింపవచ్చును. అభ్రకము విశేషముగా దొరుకుటచేతను, అభ్రక ఉత్పత్తిదారులందరు ఇతరదేశముల దయాధర్మములపై నాధారపడి యుండుటవలనను, ఈ అభ్రకము నుపయోగించు, ఎలక్ట్రికల్ యంత్రములను తయారుచేయు, యంత్రాగారమును షుమారు రు. 50 లక్షల మూలధనముతో నిర్మించిన వీరికి మహోపకారము గను ఇటులనే, బాక్సైటిస్, మొదలయిన ఇతరఖనిజములను కూడ ఉత్పత్తిచేయించి, పరిశ్రమల నభివృద్ధిచేయవచ్చును. ఈ పరిశ్రమల నభివృద్ధి చేయుటకు షుమారు పది కోట్ల రూపాయలలో ప్రారంభింపవచ్చును. మనరాష్ట్రమున విశేషముగ పెట్టుబడి కావలసినరామపాదసాగరు, కృష్ణా, పెన్నారు మొదలయిన పెద్ద పెద్ద ప్రాజెక్టులను పనిచేసి, సద్యోఫలితము నిచ్చు చిన్న చిన్న ప్రాజెక్టులను, వ్యవసాయమునకు వెంటనే కావలసిన ఎరువులు మొదలయినవి తయారుచేయు పరిశ్రమలను కొన్ని ముడి పదార్థములను వెంటనే వస్తు సామగ్రిగా తయారుచేయు పరిశ్రమలను, షుమారు రు 25 కోట్ల మూలధనములో ప్రారంభించిన 4 లేక 5 సంవత్సరములలో ఆంధ్రదేశపు ఆర్థిక సంపత్తు భారతదేశము నందన్ని రాష్ట్రములకంటెను మిన్నగ కోర్థలలో విరాజిల్లునని ఎంచవచ్చును. ఇట్లు రాష్ట్రము ఆహారపదార్థములయందు స్వయం పోషకత్వమును జెంది ఇతరులకు సరఫరా చేయుచుండుటయే గాక వేరుశనగలకు, పొగాకు, పసుపు మున్నగు Cash crops, విశేషముగ పండించి, ఇతర దేశములకు ఎగుమతి చేసి, మన రాష్ట్రమునకు కావలసిన ఇతర వస్తు సామగ్రిని తెప్పించుకొనుటకు అవకాశము ఏర్పడును.

కాని నేడు భారతదేశము నెదుర్కొనిన ఆర్థిక దుస్థితివలన ఈ రాష్ట్రమునకు నేడు ఇంత మొత్తము ఎచ్చటినుండి రాగలదను సందేహము స్ఫురింపక మానదు. ఆంధ్రరాష్ట్రము ప్రప్రథమమునుండి స్వయంపోషకముగా నుండుననుటకు సందియము ఏమియులేదు. మిగతా రాష్ట్రములు వెచ్చించుచున్నంత ఖర్చులను పెట్టక, తగ్గించినచో కనీసము సాలుకు రెండుకోట్లవంతున అయినను లాభము మిగులవచ్చును. మద్రాసు రాష్ట్రమునకు నేడు రు 80 కోట్లు రిజర్వు ఫండుగలదు. అందు సగమైనను మనకు రావలసిన న్యాయమున్నను, కనీసము రు 10 లేక 12 కోట్లైన నువచ్చును. సాలుకు రెండు కోట్ల వంతున అయిదు సంవత్సరములలో కనీసము 10 కోట్లను, ప్రభుత్వము అప్పుగా తీసికొనవచ్చును. కావున ప్రభుత్వము ధనలోపము గలుగునని భయపడవలసిన అవసరము లేదు. అదియునుగాక మొట్టమొదటి ప్రణాళికలో అమలు జరుపనున్న స్కీములన్నియు, ఆదాయము నిచ్చునవి, ప్రభుత్వమునకు హెచ్చు పన్నుల మూలముగ ఆదాయమును అభివృద్ధి చేయునవి అగుటమూలమున, ఆంధ్రుల వద్దనుండి గాని, ఆంధ్రేతరుల వద్దనుండి గాని, ఈ పరిశ్రమలకు, కనీసము పదికోట్ల రూపాయలను ప్రోగు చేయుటకు విశేష ప్రయత్నము చేయనవసరము లేదు. పరిశ్రమాభివృద్ధికి ప్రభుత్వమువారు రూ 5 కోట్ల మూలధనముతో ఒక కార్పొరేషనును స్థాపించి, కొన్ని ముఖ్య పరిశ్రమలకు నూటికి 50% వంతున మూలధనము నిచ్చితే ధనికుల మిగతా మూలధనము వేసి, పరిశ్రమలను అభివృద్ధి చేయుటకు చాలమంది రాగలరు.

కావున ఆంధ్రరాష్ట్ర నిర్మాణానంతరమున ప్రభుత్వమువారు తమ కృషిని, ఆర్థిక సమస్యలపై కేంద్రీకరించి, నిపుణుల సలహాలతో, ఆర్థికసమస్యల నెదుర్కొనిన నాలుగైదు సంవత్సరములలో ఆంధ్రరాష్ట్రము ఆర్థిక సౌష్టవమును పెంపొందించుకొని, ఆంధ్రులు అనేక సంవత్సరములుగా బాధపడుచుండిన ఆర్థిక దుస్థితుల నుండి విముక్తిచెంది, భారతదేశమునందున్న రాష్ట్రము లన్నిటికంటెను, ముందంజవేసి విశేష గౌరవ ప్రతిపత్తులను సంపాదించుననుటకు సందియము లేదు. ఆ తరువాత International Bank లో గాని, International Monatory Fund లో గాని లేక అమెరికా వద్దగాని, కేంద్ర ప్రభుత్వ సహాయమున, మనరాష్ట్రమునందున్న రామపాదసాగరు, కృష్ణా-పెన్నారు మొదలగు పెద్ద పెద్ద స్కీములకు వలయు ఆర్థిక సహాయమును పొంది, ఆంధ్రరాష్ట్రము ఒక 10 సం॥ లో సర్వతోముఖముగ ఆర్థిక పరిణామమును పర్వతోభాయమానముగ విరాజిల్లునట్లు చేయగల్గును. ఆర్థిక సౌష్టవము పూర్తిగ చేకూరనిదే, ఆంధ్రులు తమ దృష్టిని వేటిపై మరల్చినను ఫలము అధికముగ నుండజాలదు. ఆర్థిక స్వారాజ్యము సిద్ధించనిదే, రాజకీయ స్వారాజ్యము యొక్క ఉపయోగము చాల తక్కువ. కాని ఆర్థిక స్వారాజ్యమునకు రాజకీయ స్వారాజ్యమే ముఖ్యావసరము.

ఆంధ్రపత్రిక

ఆదివారం డిసెంబరు 4, 1949

సారస్వతానుబంధము

# ప్రజా సాహిత్య పితామహులు

# కీ॥ శే॥ గురజాడ అప్పరాయ మహాకవి

సంఘ జీవితంలో సమిష్టిగా రూపొందే మార్పులు సారస్వతంలో ప్రతిబింబితం అవుతూనే వుంటవి. ఈ దృష్టితో ఆంధ్ర సారస్వత రంగంలోని ముఖ్యమైన ఘట్టాలను విభజించి వీక్షించినట్టయితే నవయుగ నిర్మాణానికి మూలపురుషుడు శ్రీ గురజాడ అప్పారాయకవి అని అనక తప్పదు. ఆంధ్రభాషకు అమూల్యాలంకృతులని భ్రమపడి, ఆనాటి మనవారు శబ్ద శాసనంలో మనభాషను బంధించివేశారు. మనభాష సాంస్కృతిక శృంఖలాబద్ధమై సామాన్యజనుల ఆదరాభిమానాలకు సాధ్యమయినంత దూరంగానే ఉంటూవచ్చింది. భాషకు సంప్రాప్తించిన ఈ దుస్థితినిబాపి తనవారైన సామాన్యజనుల వాంఛ్యాన్ని సమకూర్చి మన భాషకూ, సామాన్య ప్రజానీకానికీ ఎనలేని మహోపకారం చేసిన మహనీయుడు మహాకవి గురజాడ అప్పారావుగారు.

గురజాడ అప్పారావుగారు విశాఖపట్నం జిల్లా రాయవరం అనే గ్రామంలో 1861 సం॥ రం॥ నవంబరు 30వ తేదీన జన్మించారు. వీరి తండ్రి వెంకట్రామయ్యగారు. తల్లి కౌసల్యాంబ. విజయనగరం సెకండరీ స్కూలులో చదువుతూండగానే అప్పారావుగారు ఇంగ్లీషులో చక్కటి రచనలు సాగించేవారు. సారంగధర, చంద్రహాస-వీరు వ్రాసినవీ, సుప్రసిద్ధములయినవీ అయిన ఆంగ్ల పద్యకావ్యాలు. అప్పారావుగారు విజయనగరం కాలేజీలో బి. ఏ. పాసయి స్థానిక కలెక్టరాఫీసులో సమాస్తాగా చేరేరు. తదుపరి ఆ ఉద్యోగానికి ఉద్వాసన చెప్పి విజయనగరం కాలేజీలోనే లెక్చరరుగా ప్రవేశించారు. ఈ కాలంలోనే 'అభినవ కృష్ణరాయలు'ని వినుతింపబడిన ఆనంద గజపతి మహారాజు మిత్రత్వం వీరికి లభ్యమయింది. సామాన్య ప్రజకు అందుబాటులోలేని గ్రాంధిక భాషకు స్వాతంత్ర్యం కల్గించి, ఆ స్థానంలో వ్యావహారిక భాషను స్థాపితం చేయాలనే తమవాదాన్ని నిరూపించుకుంటూ వ్రాసిన ప్రఖ్యాత సాంఘిక నాటకం "కన్యాశుల్కం" ఈ రోజుల్లో వ్రాసినదే. నేటికీ ఈ నాటకం ప్రేక్షకుల ఆదరాభిమానాలు పొందుతూనే వుంది. సంవత్సరాలుగా మన సమాజంలో పాతుకొనిపోయిన మూఢాచారాలూ, పిచ్చి నమ్మకాలూ మొదలైన సాంఘిక సంకుచిత తత్వాల్ని ఒకటికొకటి పెకలించివేయడానికి అప్పారాయకవి కంకణం కట్టారని చెప్పడానికి ఈ నాటకం ఒక మచ్చుతునక. దీనికి కృతిభర్త ఆనంద గజపతి మహారాజు.

తరువాత 1896 సం॥ రం॥ లో అప్పారాయకవి సంస్థాన శాసన పరిశోధకుని పదవికి నియమింపబడ్డారు. ఈ సమయంలో వారు "పూసపాటి" వారివంశ చరిత్రను వ్రాయ సంకల్పించారు. కాని భగవానుడు వారి ప్రయత్నం కొనసాగనీయలేదు. ఆనంద గజపతి మహారాజులుంగారి మరణానంతరం సుమారు పదిహేను సంవత్సరాలు అప్పారాయకవి వారసత్వపు లావాదేవీలలో మునిగి ఉండడం చేత రచనలు సాగించడానికి అంతగా వీలుచిక్కిందిగాదు. ఆనంద గజపతి మహారాజు మరణంతో "ప్రపంచంనుండి ఒక విజ్ఞాన జ్యోతి నెడలిపోయినది" అని వాపోయారు అప్పారాయకవి. తమ కన్యాశుల్క నాటకాన్ని ఆనంద గజపతి మహారాజుకి అంకితమిస్తూ వారు పల్కిన పలుకులు మహారాజు సారస్వతాభిమానాన్ని వెల్లడిచేస్తయి. "జ్ఞాన సముపార్జనం వ్యసనంగాగల వాడు ఆయన సారస్వతానికి చేసిన ప్రశంసాయుతమైన ప్రోత్సాహము సారస్వత సార్వభౌముల్ని ఆయన ఆస్థానానికి ఆకర్షించి తెలుగు సారస్వత రంగచరిత్రలో ఒక ఉజ్వలకాంకాన్ని ప్రారంభించింది "అన్నారు. మహారాజుగారి ఆధ్వర్యాన" "తెలుగు హార్పు" అనే పత్రిక ప్రచురింపబడేది. వ్యావహారిక ఆంధ్ర భాషకు స్థానమిచ్చిన మొట్టమొదటి పత్రిక ఇదే. అప్పారావుగారికి ఆంధ్ర సారస్వతంలో అభిరుచి కల్గించి వారి యావజ్జీవితం సారస్వత సేవకే అంకితం చేయబడడానికి కారణభూతులయిన వారుకూడా ఆనంద గజపతి మహారాజే. మహారాజుగారి మరణానంతరం అప్పారాయకవి శాసన పరిశోధకుని పదవినుండి మహారాజుసోదరి రీవా మహారాణి అయిన అప్పల కొండయాంబగారికి కార్యదర్శిగా బదిలీ చేయబడ్డారు.

అప్పారాయకవిలో పొంగి పొరలిన దేశాభిమానము వారి రచనలలో ప్రతిబింబితం అయినది. "కన్యాశుల్కం" లో గిరీశం సురేంద్రబెనర్జీ మొదలైన మహానాయకుల గుణగణాలను కీర్తిస్తాడు. నిక్కచ్చే కాన్ని బెనర్జీ అంతటివాణ్ణి నేనేస్తానని టప్పాలు కొడతాడు. "కొండుభట్టీయం" లో కొండిభట్లు సానిదానిఇంట్లో బంగారం కాజేయడానికి ఉపక్రమిస్తున్న సమయంలో కొండిభట్లు ఏదో కేక విని భయపడి "వందేమాతరం గుంటడి" నినాదాలని సముదాయించుకుంటాడు. ఈ రెండు నాటకాలలోను ప్రతిబింబించిన వారి జాతీయ భావాలూ సంఘ సంస్కరణాశయాలూ "ముత్యాలసరాలు" లో వెల్లివిరిసినవి. "దేశమును ప్రేమించుమన్నా మంచి అన్నది పెంచుమన్నా" అనే వారి గేయం వినని ఆంధ్రుడు లేడంటే అతిశయోక్తి కాదు. అప్పట్లో దేశాభిమానమూ, స్వాతంత్రదీక్ష అని రొమ్ము విరిచి బల్లగుద్ది ఉపన్యాసాలుఇచ్చి, క్రియకు వొచ్చేసరికి చల్లగా జారుకునే స్వార్థపరుల్ని ఉద్దేశించి "దేశాభిమానం నాకు కద్దని వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్; పూని యేదైనాను ఒక మేల్ కూర్చి జనులకు చూపవోయి" అని మందలించారు అప్పారాయకవి. అంతేగాక బానిసబ్రతుకు నీచమని ప్రబోధిస్తూ "లంగరెత్తుము" అనే ఖండకావ్యంలో పంజరంబున నున్న కట్టను పగల దన్నలేక ప్రసుక్తి; నింగి పర్వగలేని జన్మము నీరసమ్మని రోసితిన్" అన్నారు. స్వతంత్ర సమరంలో ఎక్కడైనా ఎప్పుడైనా ఐక్యత ప్రాధాన్యత వహిస్తుంది. ఐక్యత లేమి వల్ల కలిగే అనర్థాలను ఓర్వలేని తనంవల్ల కలిగే దుష్ఫలితాలను వివరిస్తూ "ఓర్వలేమి పిశాచి దేశం మూలుములు పీల్చేసెనోయి, ఒరుల మేలుకు సంతసిస్తూ ఐకమత్యం నేర్చవోయి" అంటూ సంఘటిత శక్తికోసరం ప్రబోధం సాగించారు. నానామత, వర్ణముల సహపంక్తిని భోజనంచేసి కులమత తత్వాలను తీవ్రంగా నిరసించి "ఎల్ల లోకము లొక్కయిల్లై వర్ణభేదములెల్ల కల్లై వేలఎరుగని ప్రేమబంధము వేడుకలు కురియ" అనీ, "మతం వేరైతేను యేమోయి, మనసులొకటై మనుషులుంటే జాతమన్నది లేచిపెరిగి లోకమున రాణించునోయి" అనీ, "నిన్న వొచ్చా రింగిలీషులు, మొన్న వచ్చిరి ముసలమను; లటు, మొన్న వొచ్చినవాడ వీవని మరచి, పేరులు పెట్టకోయి" అనీ, విశ్వ మానవ సౌభ్రాతృత్వము పట్లా అంతర్జాతీయతపట్లా, ఏకమతం ఏకకులం అనేవాదం పట్ల తమకున్న ప్రీతిని వెల్లడించారు.

మూఢనమ్మకాలు ప్రబలడం, తీవ్రంగా నిరసించి ప్రజానీకాన్ని సంస్కరించబూనుకుని అందుకుగాను కంకణం కట్టారు. 1910 సం॥ రం॥ లో తోకచుక్క కనబడడంతో ప్రజలలో అలజడి పుట్టినపుడు, "ఆరుదుగా మినుచప్పరంబున, చొప్పు తెలియని వింత పాడమగ, చన్నకాలపు చిన్నబుద్ధులు చెదరిరొంచిరి కీడుగా" అని, "మారబంధువు ఇతడు భూమికి దారి బోవుచు చూడవచ్చెను, దెబ్బ దెనుబడి రేంయిట్లీ కొకతరి, నరుల కన్నులపండువై" అని తోకచుక్కను గురించిన యదార్థాన్ని బోధించారు.

"చెప్పేది శ్రీరంగ నీతులు—దూరేవి దొమ్మరిగుడిసెలు" అన్నట్లు సభలలో డంబాలు పల్కుతూ చాటుగా మాటుగా అవినీతికి పాల్పడేవారిని "దిద్దుబాటు" అనేకథానికలో అప్పారాయకవి చక్కగా చిత్రించారు.

మతంపేరిట మూఢాచార సంపన్నులైన గ్రామస్థుల్ని మోసంచేసే మతగురువుల్ని, "మీ పేరేమిటి?" అన్న కథానికలో అప్పారాయకవి చక్కగా చిత్రించారు. ఇంతటి అనల్ప శిల్ప నైపుణ్యమూ, చక్కని కథావస్తువూ కలిగిన కథానిక మన సాహిత్యంలో లేదు. మతాధికృతి నిరూపణ చేసుకోడానికి శైవులూ, వైష్ణవులూ పడేపాట్లూ, చెప్పే కుయుక్తులూ, చేసే కుటిల యత్నాలూ, అమాయక ప్రజలపై ఎంతటి ప్రభావం కలిగివుంటవో ఈ కథానికలో అప్పారాయకవి చక్కగా చూపారు. "లవణరాజు కల" అనే పద్య కథానికలో నాయకుడు, "మంచి చెడ్డలు మనుజులందున ఎంచిచూడగ రెండె కులములు" అనే నమ్మకంతో అస్పృశ్యజాతికి చెందిన ఒకానొక కన్యకను వివాహం చేసుకుంటాడు. "కొండుభట్టీయం"లో కొండిభట్లు తానెన్ని పాపాలుచేసినా, వైదిక బ్రాహ్మణుని కనుక ఆ పాపాలన్నీ తుడుచుకుపోతాయనీ, తాను పవిత్రుడనేననీ అనుకుంటాడు. ఈవిధంగా మతం పేరిట జరిగే దుర్మార్గాలనూ, సాంఘిక దురాచారాలనూ బట్టబయలుచేసి, సాహిత్యం ద్వారా అమోఘమైన సేవచేసి, తనంత తాను వెలుగుబాటలోనికి నడచి తనవెంట వేలకొలది తెలుగువారిని వెలుగు బాటలలోనికి నడిపించారు. మాత్యూ ఆర్నాల్డు వ్రాసిన "రగ్బీచాపెల్" అనే పద్యకావ్యంలోని మూడురకాల మనుష్యులలో అప్పారాయ కవి- మాత్యూ ఆర్నాల్డు తండ్రిలాగా మూడో తెగ మనుష్యులలోనికి చెందుతారనుకోవచ్చు.

తరువాత వ్యావహారిక ఆంధ్ర భాషోద్యమం-కాలచక్ర గమనంతో ప్రజల అభిరుచులు కూడా మారుతూనే వుంటాయి. నాటకములలోని వారి శృంగార చేష్టలూ, "వారి వియోగం, నాయికా నాయకులు కాంభోజిలోనో, మరోరాగంలోనో రోదనం చేయడం ఇవన్నీ ప్రజలకంతగా రుచించడం మానాయి." ప్రజల అభిరుచులలో విపరీతమైన మార్పులు గోచరించాయి. ప్రాచీన సాంప్రదాయాల్ని పట్టుకు వేళ్లాడే పండితులు మాత్రం ఈ పరివర్తనను కానలేక పోయారు. లక్షణ విరుద్ధంగా గ్రంధాలు రచించకూడదన్నారు. వ్యావహారిక భాషావాదం దేశానికి ముప్పు తెస్తుందన్నారు. "సత్తి ముత్తుకున్నారు" భీషణమైన వాదోపవాదాలు సాగించారు. తాము ఓడిపోతున్నామని తెలిసినప్పటికీ వ్యావహారిక భాష పనికిరాదని మొండిపట్టు పట్టారు. సామాన్యునిదగ్గర 'దారపుత్రాదులు తెల్లుంటిరి? సుఖంబుంటిరె?' అంటే ఎట్లా వుంటుందీ "పెళ్లాం-బిడ్డ సుఖంగా వున్నారా?" అంటే ఎట్లావుంటుందీ కొంచెం ఆలోచించమని వ్యావహారిక భాషావాదులు అర్థించారు. వారు "పట్టిన కుందేటికి మూడేకాళ్ళ"న్నారు. ఇట్లాంటి మొండివారినే అప్పారాయకవి "లవణరాజుకల" లో చక్కగా చిత్రించారు. "మందగించక ముందు కదుగోయ్, వెనకపడితే వెనకే నోయ్!" అని వ్యావహారిక భాషావాదులు గ్రాంధిక భాషావాదుల్ని బలంతొద్ది వెనక్కునెట్టి, పురోగాములై సారస్వతానికీ ప్రజకీ మహోపకారం చేశారు. వీరిలో గురజాడ అప్పారాయ కవి అగ్రగణ్యుడు. అప్పారాయ కవికి గ్రాంధిక భాషలో రచనలు సాగించడం చేతకాకపోవడంచేతనే ఆయన వ్యావహారిక భాషావాదనను ఇంతగా బలపరుస్తున్నారని కొందరు అధిక్షేపించినప్పుడు, ఆయన "సుభద్ర" అనే పద్యకావ్యాన్ని సలక్షణంగా, ప్రబంధ శైలిలో రచించి వారికి తగినట్లుగా సమాధానం చెప్పారు. విధిలేక కొందరు పండితులుకూడా వ్యావహారిక భాషోద్యమాన్ని బలపరచవల్సి వచ్చింది. వ్యవహారిక భాషావాదనను దూషించడానికి వ్రాసినవారి భాషలోనే తప్పులను చూపించి పండితులు సైతం గ్రాంధికంలో తప్పులు వ్రాస్తుంటే ఇక సామాన్యుల మాటేమిటని ప్రశ్నించారు అప్పారాయకవి.

## దేశమంటే మట్టికాదోయ్! దేశమంటే మనుషులోయ్!



"మహాభారతయుద్ధంలో కృష్ణార్జునులవలె అప్పారాయ మహాకవి గిడుగు రామమూర్తి పండితుడూ ఆనాటి అభివృద్ధి నిరోధకులకు ఓడించి తమ ఆదర్శాన్ని స్థాపించుకోగల్గారు. మహాకవిఅప్పారావుగారు సారథియై వ్యవహారిక భాషారథాన్ని ముందుకు నడిపించుకు పోయారు; గిడుగు పండితుడు ప్రతికక్షులతో యుద్ధాలు చేసి ఓడించి ఆ మహారథానికి దారిచేశారు. ఈ మహా యుద్ధంలో గ్రాంధిక భాషాపక్షం గెలిచివున్నట్టులయితే తెలుగు సారస్వతం కొన్నితరాలు వెనక్కి వెళ్లవలసివచ్చేది. విద్యావ్యాప్తికి పెద్ద ఆటంకం కలిగివుండేది" అన్నారొక రచయిత. అట్టి విషమ పరిస్థితులనుండి, ఈ మహా యోధులు తమ పరాక్రమం ప్రదర్శించి భాషను, దేశాన్నీ సంరక్షించారు.

"పూర్ణమ్మ" అనే పద్యకథానిక అప్పారాయ కవి ఆడపిల్లలకోసరం వ్రాసిన విషాదాంతగాథ. ఈ కథలో తల్లిదండ్రులు ధనాని కాసించి, పూర్ణమ్మను ఒక ముసలివానికిచ్చి వివాహంచేస్తారు. "మేలిబంగరు మెలతల్లారా, కలువల కన్నుల కన్నెల్లారా, తల్లులగన్నా పిల్లల్లారా, విన్నారమ్మా ఈ కథను" అనే గీతికతో ప్రారంభమయ్యే ఈ కథానిక రాళ్లను సైతం కరగించగలిగినది. వివాహానంతరం భర్తతో ప్రయాణమయి, దుర్గపూజకు పోయిన పూర్ణమ్మ తిరిగిరాదు. "కన్నులకాంతులు కలువలచేరెను, మేలిమిజేరెను మేనిపసల్, హంసలచేరెను నడకల హొయలు, దుర్గను జేరెను పూర్ణమ్మ"తో ఈ కన్నీటికథ అంతమవుతుంది. "బలబల కన్నుల కన్నీరొలికెను, పుత్తడి బొమ్మకు పూర్ణమకు" అంటారు కవి. పూర్ణమ్మే కాదు. వ్రాసినకవి, చదివే పాఠకుడూ కూడా గుడ్లనీరు గ్రక్కడం అసహజంకాదు.

అప్పారాయకవి "కన్యక" అనే కావ్య కథానికకూడా విషాదాంతగాథే. దీనిలో రాజు మదాంధతకు కన్యక బలిగావించబడుతుంది. దైవపూజకు పయనమైన కన్యకను ఆ వూరి రాజు చూచి మోహించి పట్టుకోవడానికి ప్రయత్నిస్తాడు. "ముట్టబోకుడు దైవకార్యం, తీర్చివచ్చెద నీవు పట్నం ఏలురాజువు" సెట్టికూతుర, సెటకు పోనేర్తున్ "అని సమయస్ఫూర్తి ప్రదర్శించి తాత్కాలికంగా తప్పుకుంటుంది. సెట్టి తనకన్యను అగ్నిసాక్షిగా వివాహం చేసికోవలసిందిగా రాజుకు సమర్పిస్తాడు. రాజు తృణీకారంగానవ్వి," ఓహో! ధర్మమార్గం, పట్టమేలే రాచబిడ్డకు సెట్టి కర పడమా?" అని గాంధర్వరీతిని పెండ్లాడ తానంటాడు. "పట్టమేలేరాజు అయితే; రాజు సేలే దైవముండడో కో?" అని కన్య రాజుకు పాఠంచెప్పబోతుంది. పురవునిలు పుకొని, సంఘంలో పేరు ప్రతిష్టలు సంపాదించుకోమని వైశ్యులాన్ని ప్రబోధించి, "కండకావర మెక్కి నీవీ, దుండగము తలపెట్టినందుకు, వుండదా ఒకదైవమంటూ, వుండి పూర్కొనునా?" అని రాజుకు బుద్ధిచెప్పి కన్యక మంటలోదూకుతుంది. వైశ్యుల కులదేవత కన్యకాపరమేశ్వరి గాథ నితి వృత్తంగా గైకొని ఎంతో చక్కగా రచించారీ కావ్యాన్ని అప్పారాయ కవి.

### శ్రీ వ్యాఘ్రేవు జోగి పంతులు

స్త్రీల సహజమైన కోర్కెలయిన ఆభరణాల విషయం ఇతివృత్తంగా స్వీకరించి, విద్యావంతుడైన భర్తచేత, స్త్రీకి కృత్రిమాలంకారములు వివిధంగానూ అందం ఈయలేవని చెప్పించి ఆ భరణాల విషయంలో స్త్రీల అలకను తీర్చిస్తారు అప్పారాయ కవి, "కాసులు" అనే ఖండకావ్యంలో.

అప్పారాయకవి స్త్రీ సౌందర్యవర్ణన సాటిలేనిదిగా వుంటుంది. "అరమొగిడ్చిన కన్నుగవతో, చెదరయాడెడి ముంగురులతో, చెదురు యెరగని వింక మొప్పిన, చెనగు నడకలతో"...ఇది "లవణరాజు కల" లోనిది; "తగటుబంగరు చీరకట్టి, కురుల పువ్వులసరులుజుట్టి, నుదుటకుంకుమ బొట్టుపెట్టి"... ఇది 'కన్యక' కావ్యంలోనిది; "పళ్లనుమీరిన తీపులవిడలను, పువ్వులమీరిన పోడుములున్" ... ఇది "పూర్ణమ్మ" కథానికలోనిది - ఈవిధంగా చక్కగా వుంటుంది అప్పారాయకవి స్త్రీ సౌందర్యవర్ణన.

ఒకానొక గ్రీకు గాథను కథావస్తువుగా స్వీకరించి, "డామన్ ఫితియస్" అనే పద్యకావ్యాన్ని చక్కగా రచించారు. ఈ కావ్యం ప్రకృతి సౌందర్యవర్ణనకు పెట్టినది పేరు. "తదియ చందురుడు సాకెను, చదలనిసెబసి యిరులు బ్రాకెను ......"అని ఈ మోస్తరుగా చక్కగా చిత్రింపబడింది ప్రకృతి."

వీరేశలింగం ప్రభృతుల విగ్రహారాధన వ్యతిరేకత అప్పారాయకవి సార్థింటినది. "మనిషి చేసిన రాయిరప్పకి, మహిమకలదని సాగి మొక్కుతు......" అని విగ్రహారాధనను తీవ్రంగా నిరసిస్తూ, "దేవుడు చేసిన మనుషుల్లారా, మనుషులు చేసిన దేవుళ్లారా!" అని ఆరాధకుల్నీ, ఆరాధింపబడే వారినీ అప్పారాయ కవి అపహాస్యం చేశారు. చరమదశలో అప్పారాయకవి "లంగరెత్తుము" అనే ఖండకావ్యం ప్రబోధకరంగా వ్రాశారు. దాదాపు ఇదే సమయంలో ఆంగ్లేయులు భారతీయులకు అధినివేశ ప్రతిపత్తి నిస్తామని ప్రకటించారు. దేశీయులతో బాటు అప్పారాయకవికూడా కాబోసు నని భ్రమపడ్డారు. ఈ భ్రమ ఆంగ్లేయుల యుద్ధకృషికి భారతీయుల సర్వవిధ సాహాయ్యానికి కారణ భూతమయినది. ఆంగ్లేయులకు భారతీయులు సహాయం చేయాలనీ, వారిది ధర్మపక్షమనీ, "దించు లంగరు" అనే ఖండ కావ్యంలోఅప్పారాయ కవి వివరించారు.

ఎంత కార్యనిమగ్నులయి నప్పటికీ, చుట్టూ తిరిగే మనుష్యుల వేషభాషలూ, మనస్తత్వాలూ కనిపెడుతూనే వుండేవారు. చెరువుకి పోయే ఆడవాళ్ల మాటలూ, బువ్వాలాట లాడుకునే చిన్నపిల్లల చిట్టిపలుకులూ, పోట్లాడుకొనే హిందూముస్లిముల మాటలూ ఎప్పటికప్పుడు డైరీలో రాసుకొనేవారు. తమ రచనలలో వాస్తవికమైన వాతావరణమూ, వాస్తవికమైన సంభాషణలూ చిత్రించడానికిగాను వారు ఎంతో శ్రద్ధతీసుకొనేవారు.

అప్పారాయ మహాకవికి చిత్రలేఖనలో మంచి అభిరుచి వుండేది. ప్రకృతిదృశ్యాల్నీ, తమ చిత్రాన్నికూడా చిత్రించేవారు. సంగీతంలో ఎంతో ఆసక్తివుండేది; వీణ వాయించడం కూడా సాధకం చేసేవారు అప్పారాయకవి. వీరు రచించిన "నాటిమాట మరచుటయే......" "లేవో కో మంత్రములు......" మొదలయిన పాటలకు తామే స్వరాలు కట్టారు. మహాకవి తత్వశాస్త్రవేత్త. తత్వశాస్త్రంలో వీరికి గల అభిరుచి అక్కడా అక్కడా వీరి రచనలలో గోచరిస్తూనే వుంటుంది.

ఆనాటి రాజకీయాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, స్థానికంగా జరిగే సమావేశాల్లో అప్పారాయకవి ప్రసంగిస్తూండేవారు. మహాకవి కొంతకాలంపాటు విజ

(12-వ పేజి చూడుడు)



సూర్యదేవుడు

తిరుపతిలో నృసింహతీర్థపు కొండనగల శిలామూర్తి.-ఛాయాగ్రాహకులు:శంకరప్రసాద్.



తిరుపతి, గోవిందరాజస్వామి కోనేరు.—ఛాయాగ్రాహకులు : శంకరప్రసాద్.

# విద్వాంసుల వింతజవాబులు

శ్రీమతి అనంత అమ్మాజీ

పూర్వకాలమున "అలెగ్జాండరు" అనే రాజు "గ్రీసు" దేశమును పరిపాలించెను. యితను మిక్కిలి చదువుకున్నవాడు. యువకుడే గాకుండా ఎంతటి పరాక్రమవంతుడో అంతటి ధర్మపరుడు.

మనరాజు (అలెగ్జాండరు) ప్రపంచాన్ని జయించవలెనని "ఆశ"తో గ్రీసునుంచి బయలుదేరి, దారిలో అగపడిన రాజ్యాలన్నింటినీ సునాయాసంగా జయించి చిట్టచివరకు భారత భూమిపై పడెను. భారతభూమి పొలిమేరలలో నున్న రాజ్యములు అలెగ్జాండరుతో పోరాడి, చివరకు ఓడిపోయిరి.

అలెగ్జాండరు ఆ రాజ్యాలన్నింటినీ వశపరుచుకుంటున్న సమయంలో తనపై ప్రజలను రెచ్చగొట్టిన పదిమంది మహావిద్వాంసులను పట్టుకొనెను. అలెగ్జాండరు (రాజు) ఆ పదిమందిని చంపడానికి నిశ్చయించుకొని, చంపడానికి ముందు ఒక "వినోదం" ఏర్పాటు చేసెను. ఆ "వినోదం"లో ఎవరిని "జడ్జీ" (న్యాయాధిపతి)గా నియమిస్తే బాగుంటుందనే సందేహం పొడచూపెను.

రాజు జడ్జీ విషయమై మంత్రితో "ఎవరిని జడ్జీగా నియమించిన బాగుంటుంది?" అని అడిగాడు.

మంత్రి "రాజా! ఏమిచెప్పను నాకేమీ పాలుపోకుండా వుంది. మొత్తంమీద మనకు దొరికిన విద్వాంసుల్లోనే ఒకనిని "జడ్జీ"గా నియమించటం నాకు ఉచితంగా కన్పడుతున్నది" అన్నాడు.

రాజు మంత్రిసలహా ప్రకారం ఆ మరునాడు "వినోదం" ఏర్పాటు చేయుటకు నిశ్చయించుకొని, విద్వాంసులపై చూచి "మీ తొమ్మండుగురిని మనిషి కొక ప్రశ్న అడుగుతాను. వాళ్ళలో ఎవడు చచ్చుగా జవాబిస్తాడో వాడిని ముందుగా చంపించి, తరువాత తక్కినవారిని చంపేస్తాను"ని అన్నాడు. విద్వాంసులు విధిలేక వూరకుండిరి.

ఆ మరునాడు రాజు తన ప్రత్యేకస్థానంలోనే ఈ వినోదం యేర్పాటు చేసెను. జడ్జీ, రాజు, మంత్రి విద్వాంసులు, తమ తమ ఉచిత స్థలములలో కూర్చుండిరి. వినోదం ప్రారంభ మయింది.

మొట్టమొదట రాజు మొదటి విద్వాంసుడిని చూచి "చచ్చిన వారిసంఖ్య ఎక్కువా? బ్రతికిన వారిసంఖ్య ఎక్కువా?" అని అడిగెను:

మొదటి విద్వాంసుడు ప్రశ్నకు బదులు చెబుతూ "బ్రతికిన వారి సంఖ్యే ఎక్కువ" అన్నాడు

రాజు "ఎట్లు?" అని ప్రతిప్రశ్న వేసెను.

1 వ విద్వాంసుడు: "చచ్చిన వారు లేరు గనుక" అని ప్రతి ప్రశ్నకు బదులు చెప్పెను.

మొదటి విద్వాంసుని వినోదం పూర్తయింది.

రాజు రెండవ విద్వాంసుడిని చూచి "భూమి, సముద్రాలలో దేనిలో పెద్దజంతువులు పుడతాయి?" అని అడిగాడు.

2 వ. విద్వాంసుడు: "భూమిలోనే పుడతాయి" అన్నాడు.

రాజు "ఎందువల్ల"? అని తిరిగి అడిగాడు.

2 వ. విద్వాంసుడు "సముద్రముగూడా భూమిలో ఒకభాగం గనుక" అని తిరిగి అన్నాడు.

రెండవవాని వినోదం పూర్తయింది.

రాజు మూడవ విద్వాంసుడిని చూచి "జంతువు లన్నిటిలోనూ అతి మిక్కిలి కొంటెతనం గల జంతువేది"? అని అడిగాడు.

3 వ విద్వాంసుడు: "మనుష్యులకు కంట కనపడని జంతువే కొంటె జంతువు" అన్నాడు.

రాజు "ఎలా"

3 వ విద్వాంసుడు: "కనపడిన జంతువుల కొంటెతనం మనుష్యులు తెలుసుకున్నారు గనుక వాటి కొంటెతనం సాగిందికాదు. అది సాగదుకూడాను" అన్నాడు.

మూడవవాని వినోదం పూర్తయింది.

రాజు నాల్గవ విద్వాంసుడిని చూచి "నామీద రెచ్చగొట్టడానికి మీ ప్రజలకు మీరేమని ఉపదేశించారు"? అని అడిగాడు.

4 వ విద్వాంసుడు: "రాజా! మేము చెప్పినదంతా ఒకే ఒక ముక్క. "బ్రతికితే గౌరవంగా బ్రతకండి, చస్తే గౌరవంగా చావండి" అని తెలియచెప్పాముగాని మరేమి ఉపదేశించలేదు" అన్నాడు.

నాల్గవవాని వినోదం పూర్తయింది.

రాజు ఐదవ వానిని చూచి "మొదట "దినము" పుట్టిందా? లేక "రాత్రి" పుట్టిందా"? అని అడిగాడు.

5 వ విద్వాంసుడు: "దినమే" నండి.

రాజు "ఎట్లు"

5 వ విద్వాంసుడు ""రాత్రి" దినములో ఒకభాగం కాబట్టి" అన్నాడు.

ఐదవ విద్వాంసుని వినోదం పూర్తయింది.

రాజు ఆరవ విద్వాంసునిని చూచి "ప్రజల ప్రేమను ఎక్కువగా సంపాదించాలంటే మనిషి ఏమి చెయ్యాలి"? అని అడిగాడు.

6 వ విద్వాంసుడు: "మంచిశక్తి కలిగియుండి ప్రజలను భయపెట్టకుండా వుంటే ప్రజల ప్రేమను చూరగొంటారు" అన్నాడు.

ఆరవవాని వినోదం పూర్తయింది.

రాజు ఏడవ విద్వాంసుడిని చూచి "మనుష్యుడు ఎలా దేవుడౌతాడు"? అని అడిగాడు.

7 వ విద్వాంసుడు: "మనుష్యులకు సాధ్యం కానిపనిని నెరవేర్చినట్లయితే దేవుడౌతా"డన్నాడు.

ఏడవవాని వినోదం పూర్తయింది.

రాజు ఎనిమిదవ విద్వాంసుడిని చూచి "చావుబ్రతుకులలో దేనికి బలమెక్కువ"? అని అడిగాడు.

8 వ విద్వాంసుడు: "బ్రతుకు బలమే ఎక్కువ" అన్నాడు.

రాజు "ఎలా"?

8 వ విద్వాంసుడు: "ఎందుచేతనంటే? "మన బ్రతుకు అనేక కష్ట, సుఖాల్ని మోసుకుపోతూ వుంటుంది గనుక" అన్నాడు.

ఎనిమిదవవాని వినోదం పూర్తయింది.

రాజు తొమ్మిదవ విద్వాంసుడిని చూచి "మనుష్యుడు ఎంత కాలం జీవించటం మంచిది"? అని అడిగాడు.

9 వ విద్వాంసుడు: "బ్రతుకు కంటె చావు మేలనిపించినంతవరకే బ్రతుకు మంచిది" అన్నాడు.

తొమ్మిదవవాని వినోదం పూర్తయింది.

అలెగ్జాండరు (రాజు) తొమ్మండుగురిని ప్రశ్నలు అడిగిన తరువాత, జడ్జీగావున్న పదియవ విద్వాంసుని వంకచూచి "ఇందులో ఎవడు చచ్చుగా జవాబులు చెప్పాడు"? అని అడిగాడు.

ఆవిద్వాంసుడు ఆదురు బెదురు లేక "ఒకరిని మించి మరియొకరు చచ్చుగా జవాబు చెప్పారు అందుచేత "చచ్చు" అనదగినవాడు ఎవడూ దొరకడు" అనిఅన్నాడు.

రాజు వాళ్ల యుక్తికి మెచ్చుకొని వాళ్లనందరిని వదలడమే గాకుండా, మంచి బహుమతులు యిచ్చి గౌరవించి పంపివైచెను.

జైహింద్.

## గుజ్జనగూళ్ళు బుజ్జాకేగూళ్ళు

# పావురం నీతి

శ్రీ అల్లూరి రామారావు

వేటగాడు ఒకనాడు వలపన్ని ఒక పావురాన్ని పట్టుకున్నాడుట. ఆ పావురం అతడితో అన్నదట- సర్దార్జీ! నన్ను చాలా శ్రమపడి పట్టుకున్నారు. బాగానే వుంది. కాని నావంటి చిన్నపక్షిని చంపుకు తిన్నా మీకు కలిగే ప్రయోజనం ఏమిటి? ఇప్పటికి మీరు ఎన్ని గొర్రెలు, మేకలు తినుంటారు! ఎన్ని లేళ్లు, దుప్పులు, ఒంటెలు మీ పొట్టలో జీర్ణించి వుంటాయి! అంత పెద్దపెద్ద జంతువులను తిన్నప్పటికీ మీరు తృప్తిపడలేదే, మరి నావంటి చిన్న పక్షిని తింటే మాత్రం మీకు ఏమి ఆకలి తీరుతుంది, చెప్పండి. మీరే ఆలోచించండి........మరి నన్ను వదలి పెట్టారంటే మీకు మూడు ఉపదేశాలు చెప్తాను. మీజీవితమంతా ఎంతో వుపయోగపడతాయి. నా ఉపదేశాలు విన్నతరువాత మీ జీవితంలోనే గొప్పమార్పువస్తుంది.

వేటగాడు రాజీ. ఆ పావురాన్ని ఉచ్చులోనుంచి బయటకు తీశాడు. పావురం 'కుహూ కుహూ' అంటూ వేటగాని చేతిమీద వాలి, మొదటి ఉపదేశం చెబుతాను వినండి, "ఎంత నమ్మదగిన విషయమని ఎవరు చెప్పినా, అసంభవమైన విషయాన్ని, ఎన్నడూ, ఏ పరిస్థితిలోనూ నమ్మవద్దు."

తరువాత పావురం ఎగిరి గోడమీదవాలి రెండవ ఉపదేశం చెబుతాను—"జరిగిన నష్టాలకు, కష్టాలకు దుఃఖపడవద్దు. ఇదివరలో అనుభవించిన సుఖాలను మళ్లీ కోరకు." అని చెపుతూ పావురం ఇంకా యిలా అన్నది-నా పొట్టలో పదితులాల బంగారు నాణెం వుంది. అది నిన్ను పెద్ద ధనవంతుణ్ని చేస్తుంది. ప్రపంచంలో ఇటువంటి నాణెం దొరకడం చాలాకష్టం. కాని అంత విలువైన నాణాన్ని నీవు చేతులార పోగొట్టుకున్నావు. ఇక నీ విప్పుడు చేయగలిగింది ఏముంది? ఆ బంగారు నాణెం నీకు వ్రాసిపెట్టి లేదు. అందుకనే 'చేజిక్కినటు జిక్కి జారిపోయెను' అన్నది.

ఇదివిని వేటగాడు నెత్తినోరూ కొట్టుకుంటూ 'పిల్లవాడిలాగ 'గావురుగావురు' మని ఏడవడం మొదలుపెట్టాడు. ఏడుస్తూనే— అయ్యో! ఎంత దురదృష్టవంతుణ్ని. దొరికిన బంగారం చేతులార పోగొట్టుకున్నాను. ఓ పావురమా! నిన్ను వదలిపెట్టిన క్షణం ఎంత చెడ్డదో గదా? అరచేతిలో స్వర్గం చూపించావు. నన్ను నిలువునా దోచేశావు."

పావురం నవ్వి యిలా అన్నది- నేను మొదటే చెప్పాను. జరిగిన నష్టాలకు, కష్టాలకు దుఃఖపడవద్దని. వస్తువు చేతిలోనుంచి జారిపోయిన తరువాత ఏడిస్తే ఏమిలాభం? [illegible] చక్కబెట్టుకోమన్నాను. నే చెప్పిన యీ నీతి నీవు తెలుసుకోలేదన్నమాట. రెండో ఉపదేశం కూడ చెప్పాను. అసంభవమైన విషయాన్ని ఎన్నడూ నమ్మకద్దని. మూర్ఖుడా! కొంచెం ఆలోచించి చూడు నేనంతా కలిపి ఆరుతులాలు లేను. మరి పదితులాల బంగారు నాణెం నా పొట్టలో ఎలావుంటుంది? ఓరి తెలివితక్కువ పెద్దమూర్ఖ! కొంచెం బుర్ర ఉపయోగించవోయి."

పావురం మాటలు విని వేటగాడు కొంచెం కళ్లు తెరిచాడు. సంతోషం-తో--'నా ముద్దుల పావురమా? చూడు ఆ మూడవ ఉపదేశం కూడ చెప్పవూ" అన్నాడు.

"నేను చెప్పిన ఆ రెండు ఉపదేశాలు ఏమాత్రం ఆచరణలో పెట్టగలిగావు? ఇంకా మూడవ ఉపదేశం ఎలా చెప్పేది! నీ వంటి అప్రయోజకుడికి నేను ఇక ఎట్టి ఉపదేశమూ ఇవ్వదలచుకోలేదు." అంటూ పావురం తుర్రున ఎగిరి పోయింది.

(పారసీకథకు స్వేచ్ఛానువాదం.)

# అవతారాలూ అంతర్ధానాలూ

శ్రీ రామచంద్రరావు

"సంభవామి యుగే యుగే అన్నట్టు" అని ఎవరో అంటున్నారు నేను హార్కుస్ట్రీట్ ఎలక్ట్రిక్ రైలు ఎక్కేటప్పటికి. సంస్కృతం తెలిసినట్టుగా ఈ రోజుల్లో శ్లోకం చదివే మహానుభావుడెవరో అని నే నటుకేసి చూశాను. ఆ చదివేది [illegible] బిగిస్తున్న శాస్త్రుల్లుగారూ కాదు, తమలపాకుతో పాటు పొగాకుకూడా నోట్లో పోసుకుంటూ ఎక్కువైన సున్నాన్ని ఎదటివాడి కాలికి రాస్తున్న అయ్యర్ గారూ కాదు, పంచనామాలు దిట్టంగా దిద్ది 'పరమయోగి విలాసం' చదువుకుంటున్న నాయుడుగారూ కాదు. నల్ల షెర్వానీ, తెల్ల పైజామా ధరించిన తెలుగుకుర్రవాడు స్నేహితుడితో మాట్లాడుతూ అన్నమాట అది.

"శాస్త్రుల గారికి దగ్గర మాయమైన వాడివి. ఈ వేషంలో ఎక్కడినుంచి ఊడిపడ్డావురా?" అని స్నేహితుడు వేసిన ప్రశ్నకు జవాబిస్తూ ప్రతియుగంలోనూ దేవుడు అంతర్ధానమై అవతారాలెత్తుతూ [illegible] ప్రతినిమిషం మాయమౌతూ ప్రత్యక్షమౌతూ, అవతారాలెత్తుతూ ఉంటాడని ఆ కుర్రాడు కవిత్వం చెప్పాడు. అవతారాలెత్తే హక్కు, అంతర్ధానమయ్యే హక్కు దేవుళ్ళకే కాక మనుష్యులకు కూడా ఉన్నవని ఆయన ఢంకా బజాయించాడు.

అకుర్రాడు చెప్పినదాంట్లో కొత్తేమీ లేదు. కాబట్టి సరిపోయింది కాని లేకపోతే అది 'షెర్వానీ' సువార్తగా [illegible] కొత్తమతం బయలుదేరవలసినంతమాట. ఈ హక్కులు తమకుకూడా ఉన్నవని జనం ఎప్పుడో గుర్తించారు. గుర్తించిన దానికన్నా ఎక్కువగా వాడుకుంటున్నారు.

బతికున్న మనుష్యులు అవతారమెత్తాలంటే ముందు అంతర్ధానం కావాలి. అంతర్ధానం కావటంలో కొంతమంది నైపుణ్యం చూపిస్తే, మరికొంతమంది అవతారాలెత్తటంలో ప్రావీణ్యం ప్రదర్శిస్తారు. కాని కొంతమంది అపర అభిమన్యులకి అంతర్ధానం కావటమే తెలిసి అవతారమెత్తటం తెలియక పోవటాన అసలు అవతారమే చాలిస్తూ ఉంటారు.

ఒక పెద్దమనిషి ఇరుగుపొరుగు అందరితో ముందు చెప్పకుండా అవసరమైన పనివుండి ఎక్కడికో వెళ్లి కొంతకాలం వరకూ రాడనుకోండి. ఇంక దాంతో బయలుదేరుతుంది కథ. కథలల్లగలగటానికి ఎక్కడా అస్కారం కనిపించని ఇరుగువ్యక్తులూ, పొరుగమ్మలూ ఒక పెద్ద అంతర్ధాన మహానాటకాన్ని షేక్‌స్పియర్, కాళిదాసులుకూడా దిగమ్రింగి పనికిరానంత అద్భుతంగా రాసేస్తారు. ఆయన అప్పు [illegible] పారిపోయినాడేమోనని [illegible] వివరాలనూ, ఐ. పి. లిస్టులనూ [illegible] గుమాస్తా. ఎవరికైనా హఠాత్తుగా జబ్బుచేసి పల్లెటూరెళ్లి ఉండొచ్చు, వాళ్ళను తన ఇంటికి తీసుకొస్తే తనకు గిరాకీ తగలచ్చునని కూపీలు తీస్తారు పక్కవీధిలో ఉన్న డాక్టర్ దగ్గర కంపౌండరూ, మూలఇంట్లో ఉన్న పురోహితుడూ. ఉమ్మడిగా ఉన్న జామచెట్టుకాయల పంపిణీ దగ్గర ఆయనతో పోట్లాడిన పక్కింటాయన [illegible] గొర్రెతోనూ, గాడిదతోనూ ఆయన శంకరగిరి మాన్యాలకు పోయినట్లు ప్రచారం చేస్తారు. [illegible] ఆయన అంతర్ధానానికి కారణం శృంగారరసమేనని నిర్ణయించి, [illegible] —అంతేకాకన్నా అందమైనవాళ్లు, అందమైన భర్తలు కల వాళ్ళూ—ఇంటిపట్టున ఉన్నారో లేదో దర్యాప్తు చేయటానికి బయలుదేరుతుంది. [illegible] ఉపకారం చేయటానికే తాను బతికున్నానని అనుకుంటున్న ఒక కుసలమ్మ ఆయన పెళ్ళాం దగ్గరికెళ్లి, [illegible] అనుమానాలూ, ఆలోచనలూ చెప్పి ఆమె సంసారంలో నిప్పులు పోసి [illegible] 'నీకెంత గతిపట్టించే లక్ష్మి' అని నాలుగుసార్లు కళ్లు నులుపుకొని వెడుతుంది.

[illegible] ఇంటూరిని ఎక్స్‌ప్రెస్ [illegible] గ్రామములు చూడటం ఆ పెద్దమనిషి ఏం కొంప మునిగిపోయిందని మళ్లీ పని కట్టుకొని ఇంటికి రెక్కలు కట్టుకొని వాలాడు. ఏమయింది [illegible] ప్రకటించి [illegible] నిజం చెప్పవలసివచ్చిన [illegible]

ఇరుగువ్యక్తుల, పొరుగమ్మల లెఖ్ఖా తేలిపోస్తుంది.

జనానికి ఉన్న ఈ అనవసర కుతూహలం, విపరీతమైన అనుమానం, కలలకంటే గొప్ప ఉన్న కోర్కె, వింత విషయాలకోసం ఎగురుగా చూడటంలో ఉన్న ఆసక్తి-ఇవన్నీ కలిసి లోకంలో ఎన్నెన్నో అవతారాలూ, అంతర్ధానాలూ సృష్టి చేస్తున్నవి. సాధారణంగా గొప్పగా బతికిన వాళ్లు గొప్పగానే చావాలని జనం కోరుకుంటారు. గొప్ప వాళ్ల అంతం గొప్పగానే ఉంటే సరే సరి లేకపోతే గోరంతలు కొండంతలుగా వర్ణించి గొప్ప చేయ ప్రయత్నిస్తారు. అసలు పాటను మించే కోటి వాద్యగాళ్ళు మోస్తరుగా కల్పనా పండితులు అంతర్ధానాలను ఆకర్షణీయంగా చేయటమే కాక రాబోయే అవతారాలను కూడా జోస్యం చెప్పి ఆకర్షిస్తారు.

జనక బ్రిటన్‌లో ఆర్థర్ అనే రాజు యుద్ధంచేసి [illegible] అందరినీ జయించుకుని, కష్టాలలో ఉన్న అందరినీ ఆసరాయిచ్చి పేరు తెచ్చుకున్నాడు. కాని రానురాను ఆ యుద్ధంలో పిండాలందరూ చచ్చిపోవటం [illegible] ఎన్నో కష్టాలుపడి దిక్కులేకుండా చచ్చిపోయినాడు. ఈయన మామూలు మనిషి కాదు కనుక, ఈయన చచ్చిపోలేదనీ, దేవకన్యకలు [illegible] వనానికి తీసుకువెళ్లారనీ కథలు పుట్టుకొచ్చినై. బతికి బాగా ఉన్నప్పుడు ఈయన చేసిన ఘనకార్యాలవల్ల జనానికి ఈ కథలమీద నమ్మకం కలిగింది.

పల్నాటి బ్రహ్మనాయుడి కథకూడా ఇట్లాగే ఉంది. బతికున్నన్నాళ్లూ ఎంతో ఘనంగా గడిపిన ఈ పెరుడు చివరకు పెళ్ళాం, బిడ్డలు, రాజు అంతా నాశనమై మిగిలి చెట్టులా మిగిలిపోయినాడు. చివరి రోజుల్లో [illegible] పడటం ఇష్టంలేక, సుట్టుగా ఏకాంత గుహలోనే హరి అంటామనుకున్నాడు. కాని ఆయన భక్తి-మహాత్మ్యం ఆయన తపస్సు చేసుకుంటున్నాడనీ ఎప్పుడో బయటికి వస్తాడనీ కథలు అల్లారు.

ఈమధ్య ఒకాయన కల్కి-భగవానుడు [illegible], [illegible] లేదీన అవతార మెత్తాడని, కలియుగం అంతం కాబోతున్నదనీ ప్రకటించాడు. దానిమీద

ఆయన రాసిన పుస్తకం అంగసంగ కళింగ కాశ్మీర కోసల మొదలైన దేశాలన్నిటిలోనూ, అన్నిటికన్నా ఎక్కువగా మన దేశంలోనూ ఖర్చయింది. దేవుడి అవతారాలమాట అటుంచితే మనుష్యుల్లో ఇటీవల అల్లూరి సీతారామరాజు, హిట్లర్, సుభాష్‌బోస్ ఇటువంటి కథలకు నాయకులైనారు.

సీతారామ రాజుకథ తెలియని వాళ్లు తెలుగుదేశంలో ఉండరు. [illegible] చేసి బ్రిటిష్‌ప్రభుత్వాన్ని ముప్పతిప్పలు పెట్టి గూడు [illegible] నీళ్లు తాగించాడాయన కొండలు, అడవులు, కోయబలగం సన్యాసి వేషం అంతా ఆయనకొక ప్రత్యేకత ప్రసాదించినై. [illegible] [illegible] ప్రభుత్వాలు [illegible] [illegible] ఆయన [illegible] ప్రజలంతా ఈ నమ్మకానికి [illegible] చివరకు ఆయన మీద తుపాకి పేల్చితే [illegible] సదుపుండదనీ, [illegible] కథలు వ్యాపించినై. చివరకు ఆయనని జంగాపట్టు పట్టి ప్రాణాలుపోగొట్టు కున్నప్పుడు చచ్చిపోయింది ఆయనేనని ప్రభుత్వానికే [illegible] వరకూ నమ్మకంకలగలేదంటే మిగతావాళ్ల సంగతి ఎందుకు? ఆయన తపస్సునుంచి బైటికి వస్తాడని నమ్మేవాళ్ళున్నారంటే ఆశ్చర్యపడనక్కర లేదు కాని ఈ నమ్మకాన్ని ఆధారంచేసుకుని కొందరు ఆడే నాటకాలు మాత్రం చాల తమాషాగా ఉంటై.

సీతారామరాజు తపస్సు ముగించుకుని వస్తాడని ఎదురుచూసే వాళ్లున్నారు కనక [illegible] విహారాలు పెంచుకుని కొంతకాలం తానే రాజునని చెప్పుకుంటూనూ, 'నేను ఆయనతో కలిసి [illegible] తపస్సు చేసుకున్నాను' [illegible] ఆయన వచ్చే పట్టాభిషేక యాత్రకై అన్నవస్త్రాలు కోరేదాకా దర్శ

సంఘస్తాడు. ఈసంగతి చెప్పటానికే ఆయన నన్ను పిలిపించాడు' అని చెప్పు కుంటూ మరికొందరు అనేకచోట్ల ప్రత్యక్షమైనారు. [illegible] తానే రాజునని చెప్పుకున్న ఒక ఘటికుడు చాలవరకు బండిలాగొచ్చాడు. ఆ ఊళ్ళో ఉన్న స్త్రీదర్గా, లీడర్లూ అంతా అతణ్ణి ఎన్నో పరీక్షలు క్రాసుపరీక్షలు చేశారు. ఏకాకసలు రాజునుగురించి నిర్ధారణగా తెలియక పోవటంవల్ల వాడి బుకాయింపులకు నిలవలేక పోయినారు. కాని ఒక తెలివిగల పెద్దమనిషి ఇతణ్ణి రాజు సహాయకుడుగా పనిచేసిన ఒక కోయదొరదగ్గరికి తీసుకునివెడదామని సూచించాడు. కోయదొర వేసిన ప్రశ్నలన్నిటికీ మన కథానాయకుడు సరైనజవాబులే ఇచ్చాడుకాని ఒక్కచోటవోల్తాకొట్టాడు. 'మనం ఎప్పుడెప్పుడేయే స్టేషన్లను పట్టుకున్నాం రాజుగారూ?' అని అడిగాడు కోయదొర. పుస్తకాల్లో రాసినవరసలో జ్ఞాపకపెట్టిన పేర్లన్నీ ఏకరువు పెట్టాడు మిత్రుడు. అందులో కొన్ని నిజంగా జరిగినవరసలో తప్పి తారుమారుగా ఉన్నవి. దాంతో బండారం బయటపడ్డది.

హిట్లర్ కథకూడా ఇంతే. హిట్లర్ ఆత్మహత్య చేసుకున్నాడని నిర్ధారణగా మిత్రమండలి అధికారులే మొన్న మొన్నటి వరకూ చెప్పలేకపోయినారు. ఇంతటి అవకాశాన్ని జనం ఊరికనే పోనిస్తారా? హిట్లర్ అంతర్ధానం ఐనాడనీ ఎప్పుడో అవతారమెత్తి జర్మన్‌జాతికి నాయకత్వం వహిస్తాడనీ అన్నారు. జర్మన్లు ఈ కథను నమ్మారంటే ఆశ్చర్యం లేదు కాని మనదేశంలోకూడా చాలా మంది ఉన్నారంటే వింతపడవలసిందే.

అంతర్ధానగాథల్లో సరికొత్తకథ నేతాజీ బోసుది. బోసు బతికున్నట్లు నమ్మేవాళ్లు నమ్మని వాళ్లకు కొన్ని రెట్లు ఉంటారు. అసలు ఆయన అనుచరులే తుదానికొకమాట చెపుతున్నారు. విమానం పడగానే చూశామని కొందరూ, బోసు అంత్యక్రియలు చూశామని కొందరు మొదట చెప్పారు. కాని ఇప్పుడు స్వరం మారుస్తున్నారు. బోసు రష్యాలో ఉన్నాడనీ చైనాలో ఉన్నాడనీ ఇండోచైనాలో ఉన్నాడనీ నమ్మే వాళ్లుంటే చంద్రగహంలో ఉన్నాడనీ వీళ్ళు చెపుతున్నారు. ఆయన అట్లా ప్రచ్ఛన్నంగా ఉండటానికి అంగీకరించి మీమిలో చెప్పరు. బతికున్నాడనటానికి అధారం [illegible]. చాలామంది బోసు పేరున ఒట్టుపెట్టుకున్నారంటేను, ఆయన [illegible] ఇంకా అధిపత్యం తమ చేతిలో ఎగిరిపడుతుందనుకునే వాళ్లున్నారంటేను వీళ్లు ఎందుకింత కరిణీకం చేస్తున్నారో అర్థం చేసుకోవచ్చు.

మనిషి కనపడకుండా పోయినప్పుడు కథలుకల్పించటం ఆశ్చర్యం లేదు గాని నిన్న మొన్నటిదాకా మనమధ్యనే ఉన్న గాంధీజీని గురించి కూడా ఎన్నో అమానుషకథలు [illegible] కథలు వ్యాపించిన వంటే ఏమనాలో తోచకుండా ఉన్నది. గాంధీజీ మరణించలేదని నమ్మకం కలిగించటానికి కూడా ప్రయత్నాలు జరుగుతునై. ఆల్ప్స్ పర్వతాల్లో గాంధీ సుపోలిన మనిషొకడు ఉన్నాడనీ, అక్కడి వాళ్లు ఆయన్ని గాంధీ అనుకుంటున్నారనీ కొన్ని కథలు బొమ్మలతో సహా పత్రికల్లో పడ్డయి. అయితే గాంధీజీ హత్యను కళ్లారా చూసిన దేశం అవ్వాటి ఇంతపెద్ద కథల్లో పడదలుచుకోలేదు. ఢిల్లీలో తుపాకి దెబ్బకే ఆయన గురికాకుండా, ఆరోగ్యానికై ఏ హిమాలయపర్వతశ్రేణుల్లో ఒళ్లి మరణించి ఉంటే ఈ కథ కచ్చితంగా కల్లపాలై ఉండేవి.

ఈనాడు రాజకీయ పార్టీలన్నీ కొత్త రకం భగవద్గీతను ఆచరణలో పెడుతున్నవి. రెండు సంఖ్యాబలం ఎక్కువగా ఉంటే పాంఖ్య యోగం, ఎవరి వాళ్ళ బలం ఎక్కువగా ఉంటే విషాదయోగం, బలం చేతిలోకి వస్తే విశ్వరూపప్రదర్శనం మొదలైనవి జరుగుతున్నై. అయితే వీళ్ళనీ లోకం [illegible] కొత్తగా

(12-వ పేజీ చూడుడు)

# సంపద సౌందర్యాల కాణాచి బ్రిస్టల్ నగరం

జార్జియన్ నాగరికత వెల్లివిరుస్తున్న సుందర భవనాలు

వాణిజ్య మండలి



అవాన్ నదీ పడవల రేవు



గృహాలంకరణం

# గ్రంథాలయోద్యమం—న్యూయార్కు



న్యూయార్కు కేంద్ర గ్రంథాలయం.



సంచార గ్రంథాలయం.



న్యూయార్కు కేంద్ర గ్రంథాలయంలోని సంగీతశాఖ.



చిరుప్రాయపు పిల్లలకు కథలు చదివి వినిపించు శాఖ.

## అవతారాలు: అంతర్థానాలు

(11-వ పేజీ తరువాయి)

చేర్చబడ్డది. అన్ని పార్టీలవాళ్ళూ కొంత కొంతకాలం ఈ యోగం పట్టి, అదును దొరికినప్పుడు మళ్లీ రంగంలో ప్రవేశిస్తారు. ఈ యోగాభ్యాసం అందరికీ కుదరదు. కొంతమందికి ఇది అసలు చేత కాక 'జైళ్లలో మహారాజుల్లాగా కూచోక ఈ ఖర్మం ఎందుకు' అని జైళ్లలో ప్రవేశిస్తారు. కొంతమంది కేవలం అంతర్ధానం మాత్రం చేతయి, ఏమీ చేయలేక అయోమయంగా తిరుగుతూ ఉంటారు. కొంతమంది దీనిని మహా చాకచక్యంతో నిర్వహించి, ఎంతో బలం సంపాదించుకుంటారు. ప్రస్తుతం మనదేశంలో కమ్యూనిస్టులు ఈ విద్యలో ఆరితేరారని చెప్పొచ్చు.

పిల్లనాయకులు, వ్యాపారస్తులు, ఆసాములు మొదలైనవాళ్లు అంతర్ధానయోగాన్ని అనుసరిస్తారు. కాని పిల్లా విద్యను ఎదటివాళ్ళమీద ప్రయోగిస్తారు. ఎన్నికలప్పుడు ప్రత్యర్థిపార్టీ వోటర్లను మాయం చేయటానికీ, వేలం, అమ్మకాలు జరిగేటప్పుడు పెద్దపాట పెట్టేవాళ్ళను మాయం చేయటానికీ, కోర్టు వ్యవహారాల్లో ఎక్స్‌పార్టీ సాక్షులను మాయం చేయటానికీ వీళ్లు అహీ మహీ రావణులను మరిపించే గారడీ చేస్తూ ఉంటారు. ఎన్నికల స్థానాలనూ, వేలం జరిగే స్థానాలనూ అమాంతంగా మాయం చేయటం మొదలుకుని మనుష్యులను మనుష్యులన్నే పుణ్యకాలం గడిచేదాకా మాయంచేసేవరకూ వీళ్లు వివిధ ప్రయత్నాలు చేస్తారు. ఏదన్నా మీటింగుకి వెళ్ళటానికి ఎదటిపార్టీ వాళ్లు సన్నాహపడుతున్నారనుకోండి. ఇవతల పార్టీ వాళ్లు కొందరు కొన్ని కార్లు తీసుకుని వాళ్ళ పార్టీ వాళ్లమాదిరే నటించి "మీరు మీటింగుకేనా, కార్లో పోదాపదండి. అందరం కలిసిపోదాం" అంటారు. వాళ్లు ఎక్కగానే అటూ ఇటూ తిప్పి ఏమారుమూలో, కొండని దిగబెట్టి వెళతారు. దీంతో అక్కడ మీటింగ్ పూర్తవుతుంది. ఆ పార్టీ అభ్యర్థి గద్దె దిగుతాడు.

మరికొందరు తమ కిష్టంలేని వాళ్లు చచ్చారనో, అంతుతెలియకుండాపోయినారనో ప్రచారంచేసి వాళ్ళకు అదృశ్యయోగం పట్టిస్తారు. కాని వాళ్ళకు నిజంగా ఆ యోగం అంటుకోనకపోవటంవల్ల వాళ్లు బతికే ఉన్నట్లు నిర్ధారణ అవుతుంది. చైనా కమ్యూనిస్టు నాయకులు కొమింటాంగ్ ప్రచారకుల చేతుల్లో, స్టాలిన్, మొలటోవ్‌లు అమెరికా ప్రచారకుల చేతుల్లో, లార్డ్ వేవెల్ కొందరు మద్రాసు పౌరుల చేతుల్లో, అనేకమంది సినిమా తారలు తెలుగు ప్రజల చేతుల్లో యీ ఇబ్బందిని పడ్డారు.

సాధారణంగా నిత్యవ్యవహారాల్లో అందరూ అనుసరించే అంతర్ధానయోగం మరొకటి ఉన్నది. ఇది కేవలం ఎడ్‌హాక్ వ్యవహారం. అప్పులవాళ్లు బాకీలకోసం వస్తేనూ, అప్పులిమ్మని అడిగే స్నేహితులు వస్తేనూ, ఇంట్లో ఉండకుండా మాయమవుతారు ఒక్క ఉద్యోగులు. ఉద్యోగాలున్నవని ప్రకటించి వాటికోసం మొగవాళ్లు, ముసలి ఆడవాళ్లు వస్తే మాయమై, అందమైన ఆడవాళ్లు వస్తే ప్రత్యక్షమవుతూ ఉంటారు ఆఫీసర్లు. అందరికన్నా యెక్కువ అద్దె పెట్టేవాడు వచ్చేవరకూ అంతర్ధానమై ఉంటాడు ఇంటి ఖామందు.

అయితే ఇటువంటి సందర్భాల్లో నే 'మానాన్న ఇంట్లోలేనని చెప్పమన్నాడండీ' అని చెప్పే పిల్లలూ, 'మీ ఆయనకు డబ్బు ఇవ్వాల్నే వచ్చానండీ' అని వచ్చిన వాళ్లు చెపితే 'అయ్యో! దొడ్డికి వెళ్లినట్లున్నారండీ' అని చెప్పే భార్యలూ ప్రత్యక్షమై వినోదం కలిగిస్తుంటారు.

## క్రీ. శే. అప్పరాయకవి

(8-వ పేజీ తరువాయి)

యనగరం మునిసిపల్ కౌన్సిల్ సభ్యులుగా ఎన్నుకోబడి స్థానిక విషయాలలో శ్రద్ధతీసుకొనేవారు. 1918 సం॥రం లో మదరాసుప్రభుత్వం వీరిని మదరాసు యూనివర్శిటీ సెనేట్‌కు యావజ్జీవితసభ్యునిగా నియమించింది.

అప్పారాయకవి ఆరోగ్యం 1910 సం॥రం ఆ ప్రాంతాల పూర్తిగా చెడిపోయింది. శరీరం శుష్కించిపోయింది. చివరకు భగవానుడు 1915 సం॥రం నవంబరు 30 వ తేదీన అప్పారాయకవిని మనకు గాకుండా చేసి తనలోకం తీసుకువెళ్లిపోయాడు. ఆంధ్ర సారస్వత రంగభూమినుండి ఒక మహాజ్యోతి అదృశ్యమైపోయింది. తెనుగువారు తమ అనుగు కవిని శాశ్వతంగా కోల్పోయారు. సాహిత్యం, చిత్రలేఖనం, శిల్పం, సంగీతం, చారిత్రక పరిశోధన, నాటకకళ, మొదలయిన అనేక రంగాలలో ఇంతగా కృషిచేసిన మహానీయుణ్ణి మరొకరిని మనం చూడలేము.

ఈ నాడు యిన్ని పత్రికలూ, యింత మంది రచయితలూ, పాఠకులూ వున్నారంటే అది అప్పారాయ మహాకవి చలవే సుమా. నేటి కవులూ, రచయితలూ దేశ శ్రేయస్సునూ, ఆంధ్రాభిమానాన్ని పురస్కరించుకొని రచనలు సాగిస్తున్నారంటే అది అప్పారాయమహాకవి చలవే సుమా! 'అప్పారాయమహాకవితో నవ్య సారస్వత యుగం ప్రారంభమయింది; నవ్యాంధ్ర సారస్వతానికి శ్రీరాములు చుట్టిన ఆదికవి గురజాడ' అన్నారొక రచయిత.

ఆ మహాపురుషుని వర్ధంతీ, జయంతీ కూడా అయిన నవంబరు 30 వ తేదిన వారి పవిత్రాత్మకు శాంతి కలుగుగాకయని ఆ సర్వేశ్వరుని ప్రార్థిద్దాము.

ఓం! శాంతి!! శాంతి!!!



ఓహియో విశ్వవిద్యాలయపు ఫుట్ బాల్ ప్రదర్శనారంగం—అమెరికా

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty Street, G. T. Madras.